# ఎందులకీ గోహత్య!



ప్రకాశకులు :-

**ఆర్య ప్రతినిధి సభ, హైదరాబాదు**



అనుకర్త
**గోపదేవ్**

# निवेदन

अध्यात्म भारतीय संस्कृतिका प्राण है। तो शाखाहार शरीर है। प्राचीन वैदिक ऋषि, महात्मा गौतम बुद्ध शंकराचार्य. स्वामी दयानंद सरस्वती तथा महात्मा गांधीजी नें शाखाहार का निर्दोष तथा सात्विक आहारके तौर पर समर्थन किया है। पाश्चात्य दार्शनिक बर्नार्डशॉ भी शाखाहारी थे।

भारत वर्ष कृषि प्रधान देश होने के नाते ही नही अपितु इस देशके नागरिकों के शारीरिक आर्थिक, तथा सांस्कृतिक विकास के लिए गोवध पर केवल वैधानिक प्रतिबंध ही पर्याप्त नहीं अपितु प्रभुत्वद्वारा पशु-संवर्द्धन आवश्यक है।

एक जमाना था कि वैदिक विद्वान सायनाचार्यने आंध्र देशको वैदिक सिद्धान्तिक रविप्रकाश दिया था। और वैदिक संस्कृति के रक्षणार्थ विजयानगरम साम्राज्य की स्थापना की थी। परन्तु वर्तमान युग में निःसंदेह आर्य समाज द्वारा वैदिक सिद्धान्त का प्रचार होरहा है।

"गो हत्या क्यों" इस हिन्दी पुस्तक के तेलगु अनुवाद मे निश्चित ही तेलुगु जानने वाली जनताको सुविधा होगी।

तेलुगु भाषामें वैदिक साहित्य पर्याप्त नहीं है। इसलिए निःसंदेह इस पुस्तक के प्रकाशनसे तेलुगु वैदिक साहित्यमें किंचित वृद्धि होगी।

मैं पं. गोपदेवजी का आभारी हूं कि उन्होने इस महत्व पूर्ण पुस्तकका अनुवाद परिश्रम से किया है, और श्री. पं नरेन्द्रजी प्रधान आर्य प्रतिनिधि स. हैं. स्टे का अनुगृहीत हूं कि उन्होने हमको समय पर इस पुस्तक के प्रकाशन के लिए प्रेरित किया ॥ अस्तु ॥

दिगम्बरराव लाठकर
अडव्होकेट

# సార్వదేశిక ఆర్య ప్రతినిధి సభద్వారా

## నడుపబడిన గోరక్ష-ఆందోళన కాధారము

---

భారత సంస్కృతి యందు గోవు మిక్కిలి మహత్వపూర్ణము, ఆదరణీయముగాను నెంచబడును. ప్రపంచం పుట్టిన నాటనుండి యీ స్థానము గోవుకు లభించి యున్నది. ఆర్యకుటుంబంలో, ఆకుటుంబంలో ముందు వారికెంత యాదర సత్కారములు చేయబడునో, గోవులకు సంతతి సత్కార మీయబడును. కుటుంబంలోని వ్యక్తుల నెట్లు పోషింతురో యట్లే యావులను పాలింతురు. ఆవులు ఆర్యులకు పూజనీయ ప్రాణులు. ఇల్లాలు భోజనంచేయుటకు ముందు మొదటి గ్రాసం ఆవులకని వేరుగానుంచి వాని కందజేయుట తనకర్తవ్యమే కాదు పవిత్ర ధర్మమని యెంచుతుంది. ఆవుల పాలు, పెరుగు, నేయి, మూత్రము, పేడ ఇవి యన్నియు పంచగవ్యమను పేరుతో హిందూ పరివారంలో, హిందూ సంస్కృతిలో నుపయోగింప బడుచుండును. మహాత్మాగాంధి గారి వచనములలో జెప్పినచో గోరక్షణ హిందూ హృదయానికి సత్య ప్రియసంపత్తి, గోరక్షణయందు శ్రద్ధవహించని హిందువు హిందువుకాడు. ఆ శ్రద్ధ దివ్యము, మహత్త్వపూర్ణము. కోట్లాది భారతీయులకు గోవు పూజనీయము.

అది మనచరిత్రలో స్వర్ణయుగము అలరుచుండ అపరిమితంగా

ఉండేవి. గోచర భూములకు హద్దులుండేవి కావు అప్పుడు దేశంలో దుగ్ధనదులు ప్రవహిస్తుండేవి. దేశవాసులు స్వస్థులు, బలవంతులై భాసిల్లేవారు. నాడు మానవుడు సంపత్తిని రూకలలో కాదు, ఆస్తిపాస్తులలో కాదు, భవనాలల్లో కాదు, అమోఘ ప్రమోదాలల్లో కాదు, విలాస వస్తువుల ప్రాచుర్యంలో కాదు, గోవుల సంఖ్యలో చూచేవారు. పశుధనం అతనికి ధనం అందువలననే నాడు జనులు గోవులను పోషించేవారు, గోసేవవారి పరమకర్తవ్యంగా ఉండేది, గోసేవ చేసినందు వలననే నం రాష్ట్రం నాడు బలవంతమై, స్వస్థమై యుండేది. నేడు గోవంశం క్షీణించింది. అందువలననే సార్వజనిక స్వాస్థ్యం హీనమైంది. గోధన హ్రాసనం దేశవాసుల దారిద్ర్యంలో స్ఫుటంగా ప్రతిబింబిస్తుంది.

ఆవు మనకు పాలిస్తుంది. తల్లివలె మనలను పాలించుతుంది. పోషించుతుంది. అమృతం ద్రావించి తరతరాలుగా మనకు యోగ క్షేమాలు చేకూర్చి మనలను సమర్థులను చేస్తుంది జన్మించినది మొదలు ప్రాణములున్నంతవరకు పాలు, మూత్రం, పేడ, ఎముకలు, చర్మము అన్నిటితోను మానవ సమాజానికి అమితంగా సేవచేస్తుంది. భారతీయ సంస్కృతిలో మిక్కిలి యుపయోగకారి యైన పశువు విషయంలోనే కాదు ప్రతిప్రాణి విషయంలోను ఉదాత్తమగు సేవాభావము పవిత్ర ప్రేమ, సనాతనంగా పనిచేస్తూ వచ్చాయి. అట్టియెడ పశువులన్నింటిలోను నత్యంత ఉత్తమమైన గోవుకు భారతీయ సంస్కృతిలో సర్వోపరి స్థానం ఉందంటే ఆశ్చర్య పడవలసింది యేముంది ?

భారతవర్షం కృషిప్రధానదేశం ఇక్కడి కృషివలుడు వారి పశువులే భారతానికి అన్నదాతలు. నేడు మనం ఎద్దులకు బదులు ట్రాక్టర్లు వాడ యెంత ప్రయత్నముల మైనప్పటికి, ఈ ప్రయత్నంలో ఎంతో సఫలత కనబడుతూ వుందని యెంచినా, తరతరాల వరకు ఎద్దులె భారత దేశంలో కృషి కార్యానికి ముఖ్యసాధనం కాక తప్పదు. ట్రాక్టరు కనీసం అరో

యేదె వేల రూపాయలు కాకపోదు. పరిమితాలుగు కృషీవలురకు అది అందు బాటులో ఉండదు. సన్నరైతుల కుండే పొలాలూ చిన్నవి. సామూహిక వ్యవసాయ పద్ధతులా దేశంలో లేవు. అందువలన ఎద్దులే వ్యవసాయానికి చౌకపాటు సాధనం. వాటితోనే యిక్కడ కృషి ఫలిస్తుంది.

విదేశాలనుండి ముసల్మానులు భారత దేశానికి వచ్చి రాజరికం సంపాదించారు. దానితోబాటు ఈదేశంలో పశువులమాంసం తినడం, పశువులను బలి యివ్వడం ఆరంభమైంది. ఈదుష్కార్యం భారత దేశ ఫాలభాగంలో కళంకంగా అంటుకుంది. గోవులహింసం కాంక్షించే వారి హృదయాలకది ప్రబల ఆఘాతం అయింది. ఈవిదేశ శాసకులయు, వారి ఛత్రచ్ఛాయలో పరిపుష్టులైన వ్యక్తులయు మతాంధత గోవధ రూపంలో హిందువుల ధార్మిక భావాన్ని పరిహసింప మొదలిడినప్పటి నుండి, కొందరు దూరదృష్టిగల మహమ్మదీయరాజులు హిందువుల హృదయాన్ని రాజభక్తి పూరితంచేయుటకు గోవధను శాసనంద్వారా అరికట్టారు. దానిచే వారి యార్థిక వ్యవస్థ కూడ ఛిన్నభిన్నం కాకుండ నిలిచి పోయింది. కాని, కొందరు హ్రస్వదృష్టిగల ముసలిమ్ రాజులా శాసనాన్ని తొలగించి, గోవధ కవకాశాన్ని గలిగించి, తమ పూర్వుల యౌదార్యాన్ని, బుద్ధిమత్తను పోగొట్టిన నాటినుండి హిందువుల పవిత్ర హృదయాలల్లో క్రాంతిజ్వాలలు నాలుకలు గిరమొనలు పెట్టటమే కాక ముసల్మాను శాసకుల భవనాలను భస్మీపటలం చేయు బూనుకొన్నవి. కాలాంతరంలో ఆజ్వాలల్ని ఆర్పటం అసాధ్యంకూడ అయింది.

ఇంగ్లీషు వాళ్ల ఆధిపత్యం దేశంలో ఏర్పడ్డ తరువాత స్థితి పూర్వం కంటె ఇంకా యెక్కువ చెడి పోయిందనక తప్పదు. వాళ్ల నీతి హిందూ ముస్లిములను విభక్తం చేసి, శారీరిక, మానసిక, సామాజిక దృష్టితో రెండు తెగలవారిని దాసులుగాను, బలహీనులుగాను చేసి వేసింది.

అవిధంగా తన రాజనీతి ప్రాభవాన్ని సంపాదించి భారతాన్ని పిండి పిప్పి చేయడంలో వారినీతి అగ్రసరం అయింది. ఇట్టిదూషిత నీతితోనే హిందు మహమ్మదీయుల మధ్య గోహత్య నెపంతో తగవులు పెంచి స్వార్థాన్ని సాధింపబూను కొన్నారు. ఇంగ్లీషు లిక్కడ రాజ్యంచేసిన కాలంలో ముఖ్యంగా గోహత్యకు వ్యాపార రూపం ఇచ్చిన ఘడియలు, గోవంశానికి అంతకంటె మించిన అశుభ ఘడియలు మరియొందులేవు. రక్తపిపాసువులకు దుగ్ధం రుచింపదు. వారి నోటికి వ్యాపార లాభం అనె రక్తం బాగా రుచించింది. అస్వతంత్రులు, దీనులునయిన హిందువుల గోరక్షానినాదాలు అర్థలోలుపులయిన గోరాంగుల చెవులలో ఎందుకు దూరగలవు? గోవంశం నానాటికి తీసి పో సాగింది. హిందూధార్మిక భావాలు హతమై పోయినై. దేశంలో అర్థిసంకటం యేర్పడింది. దాని పరిణామంగా ప్రజల స్వాస్థ్యం నాశనమైంది. ఎమైతే నేం? గోరాంగులకు దీనితో పని యేముంది? ఇంగ్లండు స్వాస్థ్యం బాగుంటె చాలు వారికి గోమాంసంతో, గోచర్మంతో, వారికెంతోలాభం చేకూరింది. గోహత్య నిలిపి వారీలాభాన్ని ఎందుకు పోగొట్టు కుంటారు?

భారతదేశంలో శతాబ్దాలనుండి నెలకొన్న రాజనైతిక పరతంత్రత యవసానమయ్యే శుభసమయం వచ్చింది. భారతవాసులు తమ ఆకాశం క్రింద తమభూమిపై తమంతట తాము తమ కాళ్లమీద నిలబడె గౌరవ పూర్ణ అవసరం మరల ప్రాప్తించింది. శాసనంద్వారా గోవధ అరికట్టి భారతమాత నుదుట నున్న కలంకాన్ని తుడిచి వేస్తాం అన్న భారతీయుల కలలు రూపొందే రోజులు మరల కనిపింప సాగినై. స్వతంత్రతా ప్రభాతంలో గోవధను నిషేధించు రాజశాసనాత్మక ఘంటికా నినాదాలు పొడ వలసి ఉండె కాని అందుకు నోచుకోలేక పోయిన దుర్భాగ్యులము. శాసన విధానకర్తలైన మన యధినాయకులు ఈ శుభఘడియలు వ్యర్థంగానే గడిపి వేశారు అలక్ష్యంగా నైన ఒకనాడు వివశులై వారు గోవధనిషేధం

చేయక తప్పదు. కాని, వారు పొందవలసిన కీర్తిప్రతిష్ఠలు వారికి లభ్యంకావు. ఈ కాలవిలంబం వారొనర్చిన రాజనైతిక తప్పిదంగా జనత గుర్తిస్తుంది. నాయకుల ఉదాసీనత, మహమ్మదీయులను సంతోషింపజేయాలి అనేవారి నీతి, మాంసం, చర్మం, మున్నగు వాని కొరకు గోవధ దేశంలో నానాటికి ఎక్కువ కావడం చూచి గోవధను అరికట్టడానికి కావలసిన బాధ్యత ప్రజలు స్వయంగా తామె వహించవలసి వచ్చింది. ప్రభుత్వానికి ప్రజలు తమ శుభాకాంక్ష వెల్లడించారు. ఆందోళన చేశారు. కాని, దుర్భాగ్యం అనక తప్పదు. ఆందోళన చేయువారి ఉద్దేశ విషయంలో శాసకులకు శాసకుల ఉద్దేశ విషయంలో ఆందోళన చేయువారికి సందేహాలు, అవిశ్వాసాలు ఏర్పడినవి. పరిణామం గోహత్యానిషేధం శుద్ధ ధార్మికము, ఆర్థికము నైనప్పటికి రాజనైతిక రూపం దాల్చి విషమ సమస్యగా మారింది. శాసనపథం తన ధర్మ నిరపేక్షతానె పంతో ఈ ప్రశ్నకు దూరంగా ఉండటానికి దారులు వెదకనారంభించింది భారతంలో మహమ్మదీయులు కోట్లసంఖ్యలో ఉన్నారు. వారు గోవును 'కుర్బాన్' బలి చేస్తారు. కాబట్టి శాసనం ద్వారా గోవధ అరికట్టడం భారతప్రభుత్వ ధర్మ నిరపేక్షతా ( సెక్యులరిజమ్ ) నీతి భిన్నభిన్నం చేయుటమే యౌతుంది; అని శాసకులవాదం. కాని వాస్తవం తెలిస్తే మహమ్మదీయ మతంలో గోవును బలియివ్వడం అనివార్యంకాదు. మహమ్మదీయ విద్వాంసులలో ప్రతిష్ఠిత మౌల్వీలు, వారినాయకులు ఈ సత్యాన్ని సార్వజనిక సభలలో స్పష్టంగా వెల్లడించి ఉన్నారు. అంతేకాక గోవధ నిషేధించాలి అనే ప్రజలకోరికను ఎన్నోసారులు బలపరిచి ఉన్నారు. మరియు వారు స్వయంగా గోవధను నిషేధింపమని ప్రభుత్వాన్ని కోరిన సమయంలేక పోలేదు శాసకుల దృష్టిలో ఇతర ఆర్థిక సంకటంగానీ, రాజనైతిక కారణాలుగాని ఉంటే ఉండవచ్చు. కాని, గోవధ నిషేధ ప్రార్థన సాంప్రదాయికం(కమ్యూనల్)అనిచెప్పటంమాత్రం అన్యాయ్యమూ

గోవధ నిషేధ సమస్య రాష్ట్ర స్వాస్థ్యానికి, రాష్ట్ర జీవనసు సనాతనికి సంబంధించిన సమస్య ఇంతెకాక యిది విశుద్ధమానవత్వాన్ని పురస్కరించుకొని కోరెకోరిక. భారతసంవిధానంలో ఆవులు మున్నగు ఉపయోగి పశువులు వధింపరాదని కొంతవరకు నిషేధం లేక పోలేదు. కేంద్ర ప్రభుత్వం రాష్ట్రప్రభుత్వాలకు తమతమ రాష్ట్రాలలో గోవధను నిషే-ధిస్తూ ఆజ్ఞాపత్రాలు పంపమని అనుమతికూడ ఇచ్చింది. కాని, ఏ రాష్ట్రాలు గోవధనిషేధిస్తూ ఘోషణచేసినవో యా రాష్ట్రాలను ఆవిషయంలో పునర్విచారణ జేయవలసిందని కేంద్రప్రభుత్వం మరల నోటీసులు పంపింది. సమస్త భారతంలో గోవధను నిషేధిస్తూ ఆజ్ఞప్రసరింపజేసే విషయంలో భారతప్రభుత్వపు ముఖ్యాధికారుల దృష్టి మొదటినుండి విపక్షంలోనే గట్టిగాఉంది. వారి యీపనె దృష్టి. వారి యాజ్ఞలుచూచి గోరక్షకులు, గోరక్షక సంస్థలు నిరాశచెందక తప్పిందికాదు. అందువలననే, మానవత్వాన్ని పురస్కరించుకొని ఆర్థిక దృష్టితోను, దేశహితైక దృష్టితోను గోరక్షాందోళనను చేయక తప్పినదికాదు. ఆర్యసమాజం అటువంటి సంస్థలలో ఒకటి అది దీర్ఘకాలం ప్రతీక్షించి తరువాత గత్యంతరం లేక గోరక్షాందోళన ప్రారంభించింది. ఆర్యసమాజం విరుద్ధమైన ధార్మిక సంస్థ ప్రచలిత రాజనీతితో దానికే మీ సంబంధములేదు ఈ యాందోళన మూలంగా రాజనైతిక స్వార్థాలు సాధించుకోవాలని కాని, శాసన వ్యవస్థ భంగపరచాలని కానీ, దానికి ఉద్దేశంలేదు. ఇకముందు ఉండబోదు. శాసకవర్గం కానీ, మరి యితరులుకానీ యిదియొక రాజనైతిక ఆందోళనమని చెప్పి యీ యాందోళనన ప్రతిష్ఠపాలు చేయుటతగదు. అందువలననే యీ యాందోళనాన్ని ఆర్యసమాజంలోనే కాక యితర క్షేత్రాల్లోను స్వాగతంచేస్తున్నారు. ఇయ్యది సమయానుకూలము, అవశ్యం కూడ అని యందరు చెపుతున్నారు. ఈ యాందోళన కేవలం గోవుల వధ నాపుటకే కాక యితర యుపయోగకరములగు పశువులను కూడ

చంపరాదని చేయబడుచున్నది. అందు గోవులకు ప్రాధాన్యం ఇస్తుంది.

సార్వదేశిక సభకు సంబంధించిన గోరక్షాందోళన యొక్క విశాల రూపురేఖ, సభయింతవరకు చేసిన నిశ్చయాలు, అధికారుల వక్తవ్యాలు సమాజములకిచ్చిన నిర్దేశాలు వీని యన్నింటిరూపంలోను జనులకంద జేయబడింది. పైన జూపిన ఆధారాలతో సభ యీ యాందోళన ప్రారంభించింది. ఇప్పుడది, జనులు, శాసకులు మున్నగు వారందరి యెదుట గోరక్షాందోళనకు సంబంధించిన అభియోగమును వైదికయుగమునుండి నేటివరకు గల సంపూర్ణరూపంతో వెల్లడించుట యే కాక, యీకేసులో గెలుపొందుటకు కావలసిన సహకారాన్ని జనులనుండి అర్థిస్తూవుంది. కేవల సహకారమేకాక అవసరం పడితే ప్రాణాలొడ్డి గోవులను కాపాడటానికి సిద్ధపడమని యెల్లరను కోరుతుంది. ఈ యాందోళన సఫలమైతే వచ్చే యశస్సు గోహితాన్ని కోరేవారి కెల్లరకుచిక్కగలదు. ఈ యాందోళన ఒకరికి తలవంపుకలిగించాలని చేసేదికాదు. ప్రభుత్వానికి కష్టాలు పెంపుచేయాలని చేసేదికాదు. శతాబ్దాలనుండి యేర్పడుతూవున్న పాపపంకిలాన్ని నాశనచేయాలి అని యాందోళన ప్రారంభింపబడింది. అన్యసమాజం నిమిత్తమాత్రం.

గోరక్షా సంబంధమగు నీవిషయాన్ని సిద్ధపరచటానికి ‹ గోరక్షయే రాష్ట్రరక్ష ’ అనునొక పుస్తికనుండి పొందినఉపకారం మిక్కిలి. దానిని రచించిన మహానుభావులు శ్రీయుత లాలాహరదేవ్ సహాయ్‌గారు. వారు గోహితైషులేకాక గోరక్షకులునేచి పవిత్రయజ్ఞంలో జీవనాన్ని ఆహుతిగాజేసి రాత్రింబవళ్లు గోసేవ చెయుచున్నారు, వారిసేవ యమూల్యము. ఆసేవ వలనను మేము పొందులాభము వెక్కిసుమిక్కిలి. వారికి సదా మేము కృతజ్ఞులము.

జనులు యథాసంభవం గోవులను పాలింపవలెనని, గోవంశాని

వృద్ధిచేయాలి అని, తద్వారా క్రియాత్మక ఉదాహరణ లోకమున కెరి గించాలి అని అంతమునమేము ఎల్లరను ప్రార్థించుచున్నాము. ఇప్రై నంతవరకు చంపబడిన పశువుల చర్మముతో చేయబడిన వస్తువులను కొనుట మానివేయాలి, హిందువులలో నెవరైన గోమాంసవ్యాపారం ప్రత్యక్షంగా గాని పరోక్షంగా కాని చేయుచున్నటుతెలిసిన అతనిని తెలియజెప్పి యీ వ్యాపారం మానునట్లు చెయాలి.

భారత ప్రభుత్వం గోవుమున్నగు మూకపశువులీ స్వతంత్రదేశంలో బ్రతకటానికీ అవి బ్రతికి ప్రజలను సుఖపెట్టటానిక అంగికరిస్తుందని, గోవధను మాన్పటనికి తగినశాసనంచేసి దేశంలో అంతటివానిని ప్రసారం చేస్తుందనీ ఆశిస్తున్నాము.

రామగోపాల్
సంయోజకుడు గోరక్షాసమితి
ఉపమంత్రి సార్వదేశిక ఆర్య ప్రతినిధి సభ.



# వేదము—గోవు

—:0:—

వైదిక నిఘంటువులో గోవుకు తొమ్మిది నామములున్నవి. వానిలో 'అఘ్న్య' 'అహి' 'అదితి' అనునీమూడును అహింసార్థములు గోవుహింసింపదగినది కాదని ఈ మూడునామములు స్పష్టముగా తెలుపుచున్నవి. అఘ్న్య అనుపదమునకు అర్థము గోవు హింసింప దగినదికాదని పవిత్రమనియు తెలియుచున్నది. ఈ అర్థమును ప్రమాణముగా గ్రహించి భారతమున యిట్లు చెప్పబడినది.

"అఘ్న్యా ఇతి గవాం నామ క ఏతా హంతు మర్హతి, మహచ్చకారాకుశలం వృషం గాం వా లభేత్తు యః (మ. భా. శాం. 263)

"గోవుపేరు అఘ్న్య. దీనినెవరు చంపగలరు? గోవులను లేక ఎద్దులను ఎవడుచంపునో వాడు చెడుగుచేసిన వాడగును."

వేదములో ఈ అఘ్న్య శబ్దము పలుమార్లు ప్రయోగింపబడినది అందువల్ల వేదములు గోవధను నిషేధించు చున్నవనుట స్పష్టము ఈ మంత్రము యిందులకు స్పష్టప్రమాణము. "మాతా రుద్రాణాం దుహితా వసూనాం స్వసాదిత్యానా మమృతస్యనాభిః, ప్రనువోచస్ చికితుషే జనాయ మా గామనాగాం అదితిం వధిష్ట" (ఋ. ౮. ౧౦౧. ౧౫)

"గోవు బ్రహ్మచారులకు మాత గోదుగ్ధముతో బ్రహ్మచారుల పాలన పోషణ జరుగును. ఆవు వసు బ్రహ్మచారులకు పుష్టికరమగు భోజనము నిచ్చును, అందువలన ఆవును పాలింపవలయును. ఆదిత్య

బ్రహ్మచారులకు తో బుట్టువు వలె ఆవు అనుకంపనీయము. కష్టపెట్ట తగనిది. సోదరుడు సోదరిని ప్రేమించునట్లు ఆదిత్య బ్రహ్మచారి (౪౮ సంవత్సరముల వరకు బ్రహ్మచర్యమును పాలించువానికి) కి గోవు ప్రేమపాత్రము. దయాభాజనము. గోవు అమృతమునకు కేంద్రము. గోవు వధింప దగినది కాదనియు నిరపరాధియనియు సాధు జంతువనియు నీమంత్రము ద్వారా పరమాత్ముడుపదేశించుచున్నాడు." "యదినోగాం హంసి యద్యశ్వం యది పురుషం తం త్వాసీసేన విధ్యామో యథానోసో అవీరహా" (అథర్వ ౧. ౧౬. ౪.)

"నీవు మాగోవు ప్రాణములను తీయుదువేని, అట్లే అశ్వమునుగాని పురుషునిగానీ, చంపుదువేని, మేమునిన్ను సీసపు గుండుతో ఛేదింతుము అందువలన నీవు మా వీరులను చంపజాలవు."

ఈ మంత్రార్థములను చూచిన వేదము గోహత్య నొనరించు వారిని గుండుదెబ్బకు గురిచేయునట్లు ఆజ్ఞాపించుచున్నది. "యశ్చగాం పదాస్ఫురతి ప్రత్యఙ్ సూర్యంచమేహతి, తస్య వృశ్చామి తే మూలం న ఛాయాం కరవోపరమ్ (అథర్వ ౧౩. ౧. ౫౬)

"గోవు నెవడు కాలితో దన్నునో లేక తన్ని అవమాన పరచునో, ఎవడు సూర్యుని కభిముఖముగ నిలబడి మలమూత్రములను విసర్జించునో అట్టివాని ఛాయ భూమిమీద పడకుండునట్లు వానిని సమూలముగ నాశమొనర్తును." "సూయ వసాద్ భగవతీ హి భూ యా అథో వయం భగవంతః స్యామ, అద్ధి తృణమఘ్న్యే విశ్వదానీం పిబ శుద్ధముదక మాచరంతీ" (ఋ. ౧. ౧౬౪. ౪౦.)

"ధర్మము, ఐశ్వర్యము, జ్ఞానము, వైరాగ్యము, సిరి, వీనినభివృద్ధి పరచు నో భగతీ! గోమాతా! మేమును నీ ఐశ్వర్యము లన్నింటితోను యుక్తుల మగుదుముగాక. స్వతంత్రతా పూర్వకముగ పచ్చికను మేయుము. స్వచ్ఛందముగా విచరించి శుద్ధ జలమును త్రాగుము.

గోమాతను పూజించు పౌరాణికులు ఈ వేదభగవానుని ఉపదేశ మును బాగుగ గుర్తించి గోమాత నెట్లు వాస్తవికముగ పూజింప వలెనో గుర్తింతురు గాక.

( గోమాంసం నిషిద్ధ మాంసానాం ముఖ్యతమః.)

గోమాంసము తినకూడని మాంసములలో ప్రధానము. అని వైద్యక గ్రంథములలో చరకుడు వ్రాసి యున్నాడు సాధారణముగ రోగి ఏ మాంసమును తినరాదు గోమాంసము సర్వథానిషిద్ధము. మాంస మును తినుట వలన రోగము పోకపోగా క్రొత్తరోగములు ఉత్పన్నము లగును.

కొందరు వేదమంత్రములకు ఇచ్చ వచ్చినట్లు అర్థములు వ్రాసి అనర్థము లొనరించుటకు యత్నించిరి. ఎందరో ప్రసిద్ధ విద్వాంసులు ఆయనర్థములు వేదార్థములు కావని సప్రమాణముగ ఋజువుచేసిరి. వైదిక సాహిత్యములో గోరక్షణ కర్తవ్య కర్మగా చెప్పబడినది.

పంచమ వేదమని చెప్పబడు మహా భారతమునందు అనేక స్థల ములలో గోరక్షణకు సంబంధించిన పంక్తులు మనముచూడగలము ఇంత కుపూర్వమే ఒక శ్లోకమును ఉల్లేఖించి యున్నాము. అనేక మహాపురుషులే కాక సాధారణ స్త్రీ పురుషులును ఈ భారతావని యందు గోవులను రక్షించుటకు ప్రాణములను అర్పించి యుండ హిందువులు గోవధ సమర్థకులని యెట్లు చెప్పగలరు? కొందరు సమాజ ద్రోహులు ఇతర పాపాచారముల నాచరించునట్లు సంస్కృతికి, రాష్ట్రమునకు హానిని చేకూర్చుటకై గోహత్యవంటి పాపకృత్యములకు ఒడిగట్టి యుందురు. అంతమాత్రమున సంఘము అంతయు కళంకితము కాజాలదు. ఈ విష యమున గాంధిమహాత్ముని వచనములను ప్రమాణీకరించుట యుక్తము. హిందుత్వ లక్షణములను విచారించిన వేదాది శాస్త్రముల నంగీకరించుట

పునర్జన్మమున విశ్వాసముంచుట, గీత, గాయత్రియందు శ్రద్ధగలిగి యుండుట మొదలగునవి లక్షణములనవలెను. అయినను సామాన్య హిందువునకు గోరక్షణలోని ప్రేమయే హిందుత్వమునకు ముఖ్యలక్షణముగా చెప్పబడినది. పదివేల సంవత్సరములకు పూర్వము హిందువులేమి చేయుచుండెడి వారని ఎవరైన అడిగినచో పెద్దవిద్వాంసులు, పండితులు వేదాది గ్రంథములలో గోమేధ విషయమున్నదని చెప్పుదురు. ఆరవ తరగతిలో చదువుచు (పూర్వేబ్రాహ్మణా గవాం మాంసం భక్షయామాసు) "పూర్వ బ్రాహ్మలు గోమాంసమును భక్షించిరి" అను నీ వాక్యమును సంస్కృత పాఠశాలలో చదివితిని. అప్పుడు నామనస్సులో ఇట్లు, ప్రశ్నించితిని ఇది సత్యమేనా? ఇటువంటి వాక్యములు చదివిన తరువాత కూడ శాస్త్రములలో ఇట్టి వ్రాతలున్నను వాని యర్థము మనము చెప్పునది కాదేమో అని నే నొప్పుకొనుచున్నాను. దాని కర్థము మరియొకటి యైయుండవచ్చును. నాయర్థమును నరించి లేక నాజ్ఞానమునను సరించి చూచినచో పై వాక్యమున కర్థము గోవుసంపద నురల బ్రతికించగల బ్రాహ్మణులే గోమాంసమును తినిరి. అని అర్థము చెప్పవలెను. నాకు పాండిత్యము లేక పోవచ్చును. శాస్త్రీయ జ్ఞానాధారము లేకుండవచ్చును కాని ఆత్మ ప్రతీతి ఆధారము నాకున్నది. అందువలననా చెప్పినయర్థము తప్పుగాదు. అయినను ఇట్టి వాద వివాదములతో హిందూజనులకు సంబంధములేదు. నేను వేదాదులను అధ్యయనము చేయలేదు. సంస్కృత గ్రంథములను ఎక్కువగా అనువాదము ద్వారా ఎరుగుదును అందువలన నావంటి ప్రాకృత మనుజుడు ఈ విషయమున ఏమిమాట్లాడగలడు? కాని నాకాత్మ విశ్వాసమున్నది. కాబట్టి నేను నాఅనుభవమును అన్నిచోట్లను చెప్పుదును. గోరక్షణార్థము వెదక మొదలిడిన ఎక్కడను ఒక యర్థము మనకు దొరకునో దొరకదో. కారణ మేమన మనధర్మమున మహమ్మదీయుల 'కలమా' వలె సర్వమాన్య మంత్ర మొకటి లేదు. సందేశ హరుడు (పైగంబర్) కూడ లేదు. అందు

వలనే మన ధర్మము చక్కగా తెలిసికొనలేక పోవుచున్నాము. అయిన ను అందులో సాఫల్యము లేక పోలేదు. చాలావిషయములు హిందూ జనములో స్వాభావిక రీతిని ప్రవేశించినవి గోరక్ష చేయనంత వఱకు హిందువు కాలేడని బాలకునకు కూడ తెలియును. గోసేవ భారతీయ సంస్కృతికి అపర్ణము పశువుల వలన మనకు ఆర్థికముగాను, శారీ రకముగాను లాభము దొరుకుటయే గాక అవి మనధర్మక్షేత్ర మందును సాంస్కృతిక క్షేత్రములోను తమకొక విశిష్ట స్థానమును పొందియున్నవి గోవు భారతీయ సభ్యతకు ప్రతీక మని చెప్పుట అత్యుక్తి కాదు, సత్యయు గము నుండి నేటి వఱకు ప్రతి సంస్కారము నందును గోదుగ్ధము గోఘృతము, పంచామృతము, పంచగవ్యము, మొదలగునవి ఉపయోగింప బడుచున్నవి. జమదగ్ని మహర్షి, వశిష్ఠుడు గోవును రక్షించుటకు అహింసా పద్ధతుల మీద తమ ప్రాణములను కూడ ఒడ్డిరి చక్రవర్తి యైన దిలీప మహారాజు గోవును మేపి గోసేవ నొనరించుటయే కాక దానిని సంరక్షించుటకు తన శరీరమును కూడ అర్పింప సిద్ధపడెను. చ్యవన మహర్షి తన శరీరమునకు మూల్యముగా చక్రవర్తి యగు నహుషుని రాజ్యముగాక ఒక గోవుగా నిర్ణయించినాడు. కృష్ణ భగవానుడు స్వయముగా గోసేవయాదర్శమును ప్రకటించుటకై గోపాలుడైనాడు.

బుద్ధ మహాత్ముడు మహావీరుడు, గురు గోవింద సింహుడు సంత కబీరదాసు, గోస్వామి తులసీదాసు, చైతన్య మహా ప్రభు, దయా నంద మహర్షి, పండిత మదన మోహన మాలవ్యగారు, గాంధి మహాత్ముడు మరియు ననేక మహాపురుషులు గోరక్షా మహత్యమును జనులకు ప్రబోధించి యుండిరి. అది మన కాదర్శము అనుకరణీయమును చిన్న చిన్న సమయాలలో భారతీయ సంస్కృతి కొఱకు మరియు ప్రపంచ హితనిమిత్తమును మహా పురుషులు గోరక్షణను, గోసేవను బలపఱచి యున్నారు. గోసేవకు సంబంధించిన కార్యములు భారతీయ సంస్కృతికి

స్వభక్తికిన్నీ, ధర్మమునకు అంగములుగా వారు చెప్పియున్నారు.

## దయానంద మహర్షి గోరక్షకై చేసిన దేమి?

శ్రీమద్దయానంద మహర్షి గోవధ దేశమునకెంత హానికరమని గ్రహించెనో మరియు దానిని శాసనము ద్వారా అరికట్టుటకు ఎంతవేగిరపాటుతో ఉత్సాహవంతులై యుండెనో తెలిసికొనవలయును. అజమీరు నందు అంగ్లేయులతో నతడు చేసిన సంభాషణము చూడవలెయును. ఇచట డిప్యూటీ కమీషనర్ మేజర్ ఎ. జీ. డేవిడ్సన్ తో ఆతడు మాట్లాడి యుండెను. మహర్షి అతనితో "నీవు రాజువు ప్రజ నీకు సంతానము వంటిది. నీ శాసనములో మతాంతరులు అమాయకులగు ప్రజలను మోసపుచ్చు చున్నారు. ప్రజలను రక్షించుట నీ ధర్మము" అనెను. అతడందులకు "ధర్మములో శాసకులకు హస్తక్షేపము చేయరాదు" అని బదులు చెప్పెను. మహర్షి ఈ విషయమును మాట్లాడుటకై అసిస్టెంటు కమీషనరు ఆప్టన్ తో కూడ కలిసియుండెను.

## గోవధ నరికట్టుటకు స్వామి చేసిన ప్రయత్నము.

కర్నల్ బ్రూక్ గవర్నరు జనరల్ కు ఏజంటుగా యుండెను అతనికి కాషాయి వస్త్రములు కట్టుకొనినవారు గిట్టరు, ఒకనాడు స్వామి అజమీరు లో వంశీలాల్ తోటలో కూర్చుని యుండెను. ఎందులకో కర్నల్ బ్రూక్ ఆ వైపునకు వెళ్లెను. వారిరువురు పరస్పరము కొంత తడవు సంభాషించిరి స్వామి తన హేతువాదముతో "గోవు వలన అనేక జీవ జంతువులు, మనుష్యులు పోషింపబడుచున్నారు. గోవధవలన హాని గల్గు చున్నది" అని అంగీకరించునట్లు చేసి అంగ్లేయులు గోవధ నెందుకు నిషేధింపరు అని అతనిని ప్రశ్నించెను. కర్నల్ బ్రూక్ గోవధ వలన హాని గల్గు చున్నదని యంగీకరించియు గోవధ నరికట్టుట తన

గాని చంపనిచ్చుటకు గాని అంగీకరింపరు వానిని చంపుటవలన రాజులకు ప్రజలకు ఎంత హాని కలుగునో అంతటి హాని మరియే దుష్కర్మ వలనను కలుగదు. ఈ విషయము ‘ గోకరుణానిధి ’ యందు స్పష్టముగా నిర్ణయింప బడినది. ఒక్క గోవును చంపిన నాలుగు లక్షల ఇరువది వేల ( ౪౨౦౦౦౦ ) మనుష్యుల సుఖమునకు హాని కలుగును. అందు వలన మనమందరము కలిసి ప్రజల హితము గోరు రాజరాజేశ్వరి శ్రీమతి క్వీన్ విక్టోరియా మహారాణికి ఆమె రాజ్యమున న్యాయ పద్ధతిలో జరుగు గోవధ రూప అన్యాయమును విన్నవించి గోవధను అరి కట్టి ప్రసన్నులగుటకు ఏంచుచున్నాము విద్యను, ధర్మమును, ప్రజా హితమును ప్రేమించు మహారాణి యొక్క పార్లమెంటు సభ, భారత దేశములో అందరికంటెను ఉన్నతాధికారియైన గవర్నర్ జనరల్ దేశమునకు హాని కారకమైన ఈ పశు వధను అరికట్టి మనను సంతోష పెట్టుదురుగాక ! గోవు మున్నగు పశువులను చంపుట వలన పాలు పెరుగు లేక పోవుటయే కాక రైతులకు కలుగు హాని మితి మీరి రాజు కు, ప్రజలకు ఎక్కుడు హాని కల్గుచున్నది. దేనివల్ల ఎక్కుడు ఉపకారము కలుగునో దానిని పోషించి వృద్ధి చేయుటయు, నాశము చేయ కుండుటయు విద్యాబుద్ధులకు ఫలము, సిద్ధాంతము కాదా ? పరమ దయాళువు, న్యాయకారియు, సర్వశక్తి మంతుడు నగుపరమాత్ముడు జగదుపకారకమగు నీ పనిచేయుటలో మనకందరకు ఐకమత్యము గలిగించుగాక !”

ఈ పత్రముపై కోట్ల కొలది దేశవాసుల హస్తాక్షరములను చేయించి గోవధను నిషేధించుటకై గవర్నరు జనరల్‌కు, విక్టోరియా మహారాణికి వెరువెరుగా పత్రములను మహర్షి పంపియున్నాడు మరియు పంజాబు, పటియాల, కాశ్మీరు, రాజస్థానము , మున్నగు ప్రదేశములల్లో వ్యాఖ్యానముల ద్వారా గోవధ వలన గలుగు హానిని తెలుపుటకై రూపసింహ మహాశయుని పంపియున్నాడు.

## దయానంద మహర్షి యుపదేశము.

ఆర్యులు రాజ్యంచేసిన కాలమున మహోపకారములగు గోవు మున్నగు పశువులను చంపేవారు కారు. నాడు ఆర్యావర్తమునందును ఇతర దేశములందును కూడ మానవులు సుఖముగా నుండెడువారు. పశువులు చక్కగా వర్ధిల్లుటవలన పాలు, పెరుగు, నేయి మున్నగు రసవంతమగు పదార్థములకు కొఱత యుండెడిదికాదు. ఏ దేశముల నుండి మాంసాహారులీ దేశమునకు వచ్చి గోవు మున్నగు పశువులను చంపు అధికారు లయినప్పటినుండియు క్రమముగా ఆర్యుల దుఃఖములు పెరిగిపోయినవి. మూలము నశించిన పత్ర పుష్పాలెక్కడ నుండి రాగలవు.

వర్తమానమున గోరక్షణ ముఖ్యతాత్పర్యము. ఒక్క గోవు ఒక తరములో నాలుగులక్షల పదివేల నాలుగు వందలమంది జనులను తృప్తిపరుపగలదు. ఆ గోవునకు సంబంధించిన యారు తరముల ప్రయోజనమును లెక్కించిన నసంఖ్య జనులకది మేలు గలిగింప గలదిగా సిద్ధమగుచున్నది. ఆవు, ఎద్దువలన కలిగినంతఫలము గేదె, ఎనుమువలన నెన్నడును కలుగదు. గోవుకంటె గేదె యెక్కుడు పాల నిచ్చినప్పటికి దాని పాలు ఆవుపాలకువలె నారోగ్యకరములు కావు. అందువలన నార్యులు గోవును సర్వశ్రేష్టముగా నంగీకరించిరి.

### ఆవుయొక్క ఉపయోగము.

ఆవులు మొదలగు పశువులను రక్షించుటవలన ధాన్యాదులు ప్రియములు కావు. పాలు, పెరుగు, సమృద్ధిగా దేశము నందున్నపుడు దరిద్రులుకూడ వానిని పొంద గలుగుదురు. భోజన పదార్థములలో పాలు పెరుగు ఎక్కువగా లభించినపుడు ధాన్యము తక్కువ యుప

యోగింపబడును. అందువలన జలము, దుర్గంధము తక్కువగుచు వాయువు, వృష్టిజలములు శుద్ధములగును. అందువలన రోగములు తక్కువయై సుఖము వర్ధిల్లును.

## గోహత్య మహా పాపము.

ఒకగోవు తనజీవనమున వేలాది మనుజులకు సుఖము నిచ్చును దాని మాంసమువలన సుమారు (౮౦) ఎనుబది మంది మాత్రమే తృప్తి పడగలరు. కాబట్టి యాతుచ్ఛలాభము కొఱకు పశువులను వధియించుట యసంఖ్య ప్రాణుల సుఖమును నశింపజేయుట యగును. ఇంతకంటె మహాపాపమే మగును?

## గోవు ఉపకారము—మనుష్యుని కృతఘ్నత.

పశువులు నిస్సారమైన అమృతమువంటి దుగ్ధాదుల నొసంగును. ఎద్దులు నాగలిని, బండ్లనులాగి ధాన్యాదులను చేకూర్చుట కెంతయు తోడ్పడును. క్షీరము—అన్నము మొదలగు పదార్థములను భుజించి మనుజులు తమ బుద్ధి, బలము, పరాక్రమాదులు పెంపుచేసికొందురు. ఆరోగ్యవంతులై పుత్ర పుత్రికలతో బంధువులతో నెల్ల సుఖముల ననుభవింతురు. పశువులు మనుజులను బంధువులవలె ప్రేమించును ఎక్కడ కట్టియుంచిన నక్కడే యుండును. ఎటునడిపిన నటు నడుచును.

పశువులు చచ్చిన తదుపరికూడ వానిచర్మము మనకు కంటకము లనుండి రక్షించుకొనుట కుపయోగించును. ప్రతిదినము అడవులకు బోయి గడ్డి గాదము తిని వేళకు గృహముజేరి తమ పాలకులకు మధుర దుగ్ధములను పిండును. ఈ విధమున తమ పోషకుల నన్నివిధముల

కాపాడుటకు జీవితమంతయు ధారబోసి వారి సుఖములను పెంపుచేయును. ఇంతటి శుభగుణములు గల పశువులను గొంతుకోసి వాని మాంసముతో తమ పొట్టనింపుకొని ప్రపంచమునకు హానిగలిగించు మనుజుల కంటె నెక్కువ విశ్వాస ఘాతకులు గానీ, అనుపకారులు కానీ, దుఃఖదాయకులు కానీ మరి యెవరుండురు?

యజుర్వేదము నందలి ప్రథమ మంత్రమున పరమేశ్వరుడిట్లు ఆజ్ఞాపించియున్నాడు. (అఘ్న్యా పశూన్ పాహి.)

పశువులు హనన యోగ్యములుకావు. అవి కాపాడదగినవి. కాబట్టి వానిని పోషింపుడు. అందువలననే భారతీయులు బ్రాహ్మణులు మొదలు శూద్రులవరకు నెల్లరు పశువులను హింసించుట పాపము. అధర్మము నని యెంచి వానిని కాపాడుచుండిరి.

పశువులను వధించువాడు, పశుహంతకుడే కాదు వాడు మానవ హింసకుడు. పశు నాశనమువలన రాజు ప్రజలు నెల్లరు నశింతురు పశువులనాశనమువలన దుగ్ధాది పోషక పదార్థములు తగ్గిపోవును, మరియు. కృష్యాది కార్యములు చేయుటకు సాధనములేక ధాన్యములుత్పన్నములుకావు. కాగా ప్రజల నాశనముకాక మరి యేమగును. రాజ్యమునందు ఐశ్వర్యము వర్ధిల్ల వలయునని పశువులు, పశుపాలకులు, కృషి వ్యాపారములు వర్ధిల్ల వలయును. వాని హ్రాసమువలన నాశము తప్పక [illegible].

[illegible]శువులను హింసింపరాదనియు, దుర్బల పశువులద్వారా కష్టకరము [illegible] చేయింపరాదనియు న్యాయ సూత్రములున్నను అవి పాటింపువారెవరును లేరు! ఇది యెంతటి యన్యాయము! పశువులను

కష్టపెట్టుటయేకాక వానిని చంపి తినుటకంటె ఘోర దుఃఖమేముండును?

భగవన్! అపరాధమొ కింతయు లేక చంపబడు నీ మూకపశువు లపై నీకేల దయరాదు? వానికి నీ న్యాయ సభయందు ప్రవేశము లేదా? వానిపీడను తొలగింప నేలుదలచవు? వానిమొర యేలవినవు? ఈమాంసాహార రాక్షసుల హృదయము దయాభావము నేల కలిగింపవు? నిష్ఠురత కఠోరత, స్వార్థపరత, మూర్ఖత మున్నగు దుర్గుణగముల నేల తొలగింపవు? ఈహింసకులిట్టి దుష్కర్మములనుండి ముక్తులగుటకు నీదయకంటె వేరొండుపాయమేమున్నది?

**ఓమహారాజాధిరాజా! జగదీశ్వరా!**

ఈమూక పశువులను రక్షించుటకు మాద్వారా తపించ వేయుటకు నుగ్రహించుము.

# క్రైస్తవ మహమ్మదీయ మతములు.

మనప్రభుత్వము వారి సమర్థకులు భారతము సాంప్రదాయిక (Secular) రాజ్యమందురు. అందువలన ఈదేశములో గోహత్యను నిషేధించుటకు శాసనము చేయరాదందురు. ఈయుక్తి సరియైనదికాదు. భారతదేశములో ముఖ్యముగ హిందువులు, సిఖ్ఖులు, బౌద్ధులు, జైనులు, మహమ్మదీయులు, క్రైస్తవులు నివసించు చున్నారు. వీరిలో హిందు, సిఖ్ఖు, బౌద్ధ, జైన, పారసీకుల దృష్టిలో గోవధ నిషిద్ధమేకాక గోరక్ష యనివార్యము. క్రైస్తవ మహమ్మదీయులలో మాత్రము గోవధను నిషేధించువారులేరు. కాని వారి మతానుసారము గోవును వధించుటకాని, గోమాంసము తినుట అనివార్యముకాదు. ఇందుకు విపరీతముగా అక్కడక్కడ వారి మతగ్రంథములలో నిషేధమే కనిపించు చున్నది. మహమ్మదీయ మతానుసారము గోవధ యనివార్య మగునెడల బాబరు, హుమాయున్, అక్బర్, జహంగీర్, హకీంఅజ్ మల్ ఖా, మౌలానా అబ్దుల్ బారి, సర్ సయ్యద్ అహమద్ ఖా, డాక్టర్ సయ్యద్ మహమ్మద్ మున్నగు ముసల్మానులెందరో గోరక్షణ సమర్థించి యుండరు. మరియు మహమ్మద్ షా మొదలగు ముస్లిమ్ శాసకులు తమ కాలములో శాసనము ద్వారా గోవధను అరికట్టియుండరు. ఎందరో మౌల్వీలు హజరత్ మహమ్మదు సాహెబ్ గోమాంసముకంటె గోక్షీరమునందు ఎక్కువ పక్షపాతియై యుండెనని వ్రాసియున్నారు మహమ్మదీయ వైద్యులచే వ్రాయబడిన (మఖజన్ ఉల్ అదలియా) అను యూనాని వైద్యక గ్రంథములో గోమాంసము తినుట వలన వచ్చెడి రోగములను కూడ ఉల్లేఖించియున్నారు. మహమ్మదీయ రాజ్య కాలములో గోహత్యజరిగినది; కాని చాల తక్కువ ఎందరో మహమ్మదీయ మహారాజులు అష్టల నసలును (వంశమును) సంస్క

రించుటకు యత్నించిరి. టిప్పుసుల్తాను అమృతమహల్ను ఉత్తర భారతమున నవాబు ఝుజ్జర్ హరియానా సస్యను పెంపుచేయుటకు యత్నించియుండిరి గోవంశమును రక్షించుట చేతను ఉన్నతికి తెచ్చుట చేతను మహమ్మదీయ రాజ్యకాలమునందు చాల సంపన్నములు వఱకు నేయి పాలు చుండెడివి చాల చౌకగా దొరకుచుండెడిది. ఎక్కువ భాగము అమ్ముటకు బదులు ఉచితముగా నిచ్చుచుండిరి.

ఆంగ్లేయులు రాజనైతిక కారణముల వలనను ఆర్థిక కారణముల వలనను గోవధను పెంపుచేసిరి ఇది సత్యము; కాని క్రైస్తవ మత దృష్టితో చూచిన గోవును చంపుటగాని గోమాంసము భక్షించుట గాని క్రైస్తవుల కనివార్యముగాదు. గోవధ నిషేధము ఈ క్రింద బైబిలు వాక్యములలో మనకు స్పష్టపడగలదు.

**I will take no bullock out of the house nor he-goat out of the fold for every beast of the forest is mine and the cattle up on a thousand hills. I Know all the fowls of the mountains and the wile beasts of the field are mine. If I were hungary I would not tell thee, for the world is mine and the fulness there off. Will I eat the flesh of bulls or drink the blood of the goats? Off unto god thanks giving, and pay the vows unto the most high. And call upon me in the day of trouble, I will deliver thee and thou shalt glorify me.**

**(Bible-book of Psalms. 50, 9 to 15)**

"నేను నీ ఇంటినుండి ఎద్దుగాని నీ పశుశాలనుండి పోతు మేకను గాని తీసికొనను. కారణమేమనగా అరణ్యమునందలి అన్ని జంతువులు, వేల కొలది పర్వతముల మీద నుండు గ్రామ పశువులు నావే. పర్వతముల మీద నుండు పక్షులన్నిటిని నేనెరుగుదును. పచ్చిక బయళ్లలో జంతువులన్నియు నావే. నాకాకలియైన నేను నీతో చెప్పను. జగత్తంతయు నాది. అందులో నున్నదంతయు నాదే నేనెద్దుమాంసము తిందునా మేకపోతు రక్తము త్రాగుదునా? పరమేశ్వరుడనైన నాకు ధన్యవాద రూపబలి నెనంగుడు. మీ మొక్కుబడులు తీర్చుకొనుడు. సంకట దినములలో నన్ను పిలువుడు. నేను మిమ్ములను సంకటములనుండి ముక్తులజేయుదును. మీరు నా మహిమను పొగడుదురు గాక!

(బైబులు స్తోత్ర మహిమ)

**"He that killeth an ox is as if he slew a man, he that Sacrificeth a lamb as if he cut off a dog's neck.**

**(Isaiah chap L X V I. 3)**

"ఎవడేని ఎద్దును చంపిన వాడు మనుష్యుని చంపినట్లే మరియు నొకడు గొఱ్ఱెపిల్ల గొంతుకోసిన కుక్క గొంతు కోసినట్లే

క్రైస్తవ మతమున మాంసము తినుటకూడ నిషేధింప బడి యున్నది చూడుడు:—

**"It is neither good to eat flesh nor to drink wine, nor anything where by thy brother stumbleth or is offended or is made weak."**

**(ROMANS X I V. 21)**

"మాంసము తినుటగాని సారాయమును త్రాగుట గాని మంచిది గాదు. నీ సోదరుడు దేనివలన తొట్రుపాటు చెందునో మరియు దేని వలన దుఃఖితుడు, దుర్బలుడునగునో యట్టికార్యము చేయరాదు. ఈ వాక్యములను చూచినపుడు గోవధను చేయుటగాని గోమాంసమును తినుటగానీ నిషిద్ధమని స్పష్టముగా బోధపడును.

పర్వత ప్రదేశములలో నుండువారికి గోహత్యచేయుక తప్పదని కొందరందురు. పరీక్షించిన మీదట వీరు చెప్పునది సరికాదని తెలియు చున్నది. కాశ్మీరమునుండి మణిపురము వఱకు పర్వత రాజ్యప్రదేశములు. ఆ ప్రాంతములలో బహువర్షముల నుండి గోవధ అరికట్ట బడి యున్నది. కాశ్మీరులోను, నేపాలమునందును గోహంతకుడు దండింప బడును, మణిపురము, సిక్కిం, హిమాచల ప్రదేశములలో రాజ్య శాసనము ద్వారా గోవధ నిషేధింప బడియున్నది.

పై ఉదాహరణములను బట్టి భారత వాసులలో ఏ తెగవారికిని గోవధ చేయుటగాని గోమాంసము తినుటగాని అనివార్యమని చెప్పుటకు వలను పడదు. పై పెచ్చు నాల్గింట మూడుపాళ్లు దేశజనులు గోవులను రక్షించుట పరమ కర్తవ్యముగా నెంచుచున్నారు. కాబట్టి గోరక్షా ప్రశ్న శుద్ధ సాంస్కృతికము, రాష్ట్రీయము నని చెప్పుటయే తగును. అందు వలన సాంప్రదాయిక (Secular) రాజ్యములో కూడ గోవధ నిషేధము ఆవశ్యక మనియు తేలు చున్నది.

అక్బరు తన జన్మది నోత్సవము నందును, పట్టాభిషిక్తుడైన దినమందును, తులాదానమునకు సంబంధించిన దినమందును, పుత్ర పౌత్రుల వార్షిక జన్మదినము లందున్ను పశువులను చంపరాదని ఆజ్ఞ ద్వారా నిషేధించు చుండెడివాడు. జహంగీరు కాలములో కూడ రాజాజ్ఞ

అసలులో నుండెను. ఇట్లు సంవత్సరములో నాలుగు నెలల కాలము పశుహింస జరిగెడిది కాదు. ప్రసిద్ధుడైన ఫ్రాంసీసు డాక్టర్ బర్నియర్ షాజహాన్ బాదుషాహ సమయములో రాజవైద్యులలో నొకడుగా నుండెను. అతడు తన యాత్రా వృత్తాంతములో ఇట్లు వ్రాసెను. "ఒకమాటు పశువుల సంఖ్య తగ్గిపోవుట తెలిసికొని జహంగీర్ బాదుషా తనరాజ్యమున గోహత్య ఎన్నడును జరుగరాదని ఆజ్ఞాపించినాడు. బాదషా యొక్క మరియొక ఆజ్ఞాపత్రము, అతని పితృ ఇచ్చిన వ్యవస్థ వలనను మనకీ విషయమింకను బాగుగా స్పష్టపడును. "ముసల్మానులకు నేను విన్నవించున దేమనగా 'హదీస్' లో పాలనిచ్చుచున్న ఆవును గురించియు, ముందు పాలనిచ్చుటకు సాధనముకాబోవు ఆవును గురించియు ఇట్లు ఆజ్ఞాపింపబడియున్నది 'హదీస్' లో నాలుగు విషయములు నిషిద్ధముగా చెప్పబడియున్నవి. అందువలన మహమ్మదీయులు వానిని అసలులో పెట్టవలెను అవి యెవ్వియనగా (౧) చెట్టును నరుకుట (౨) మనుష్యుని అమ్ముట (౩) గోవును వధించుట (౪) వ్యభిచరించుట వీనిని ఆచరించువారు నరకములో బడుదురు. పాలనిచ్చు ఆవును చంపువాని విషయములో 'హదీసు' లోను వ్రాయబడియున్నది మరియొక ఫర్మానాలో నిట్లున్నది.

" ధనికులు, దరిద్రులు పిన్నలు పెద్దలు, గ్రామవాసులు, నగరవాసులు ఎల్లరు ఈ దినములలో వెలువడిన రాజుగారి ఆజ్ఞా పత్రమును తెలిసి కొందురుగాక. "ఆవులు, ఎద్దులు అగణిత లాభములను కలిగించునవి. మనుష్యుల జీవనమునకు ఆధారము సస్యములు, ధాన్యమును. ఈ రెండును కృషిలేక లభింపవు. ఆకృషి పశువులు లేకున్న అసంభవము. అందువలన ఆవులు, ఎద్దులు, మనుష్యులు మరియు నితర పశువులు సమస్త సృష్టికి ఆధారములు. అందువలన పశువుల వధ అనుచితము. ఈ విషయమును మనసు నందుంచుకొని మహా

రాజాధిరాజు మాధవరావు సింధియా బహదుర్ ప్రార్థించి నందున పాదుషా ఇట్లు కోరుచున్నాడు—దేశమునందు గోవధరీతి పూర్తిగా ఉండ రాదు గోహత్య సర్వథా నిషేధింప బడవలయును. ఈ ఆజ్ఞా పత్రమును చూచుటయే తడవుగా రాజ్యాధి కారులెల్లరు ఈ ఆజ్ఞను అమలులో పెట్టవలెను. ఎవరైనను గ్రామములో గాని నగరములో గాని ఆజ్ఞను తిరస్కరించి గోవధచేసిన దండనీయు లగుదురు.''

షహన్షా బాబర్ (బాబరు చక్రవర్తి) గోవధ చేయరాదని ఆజ్ఞాపించి యున్నాడు అదియొక పత్రరూపమున నున్నది. అది హుమాయూన్‌కు వ్రాసిన పత్రము. "పుత్రా! హిందూస్థానము భిన్న భిన్న మతానుయాయులతో నిండియున్నది. ఈ దేశరాజ్యమును నీ కొసంగి నందులకు ఈశ్వరునకు ధన్యవాదములు. మతాంధత (మతపిచ్చి) నుండి నీ మనస్సును దూరముగా నుంచుకొని ప్రజలకు న్యాయము చేయు చుండుము. ముఖ్యముగా గోవధ చేయకుము దానివలన నీవు హిందువుల హృదయములను వశపఱచుకొనగలవు.

(హిజ్రీ ౯౩౫)

కాబూలులోను, అఫ్ఘన్ స్థానములోను ముసల్మానులు గోవధను చేయరు.

# గాంధి మహాత్ముడు—గోరక్ష

గోవధ, మనుష్యవధకు సమానము.

నేను దీనిని స్వరాజ్యముకంటెను గొప్పదిగా ఎంచు చున్నాను.

భారత దేశములో గోరక్షా సమస్య స్వరాజ్య సమస్యకంటె ఏవిధముగను తీసిపోదు. చాలా విషయములలో నేను దీనిని స్వరాజ్యముకంటె నెక్కుడుగా తలంచు చున్నాను.

గోవును రక్షించుటకు ఉపాయములు వెదకి కనిపెట్టినంత వఱకు స్వరాజ్యమున కర్థమే యుండదు.

దేశముయొక్క సుఖ సమృద్ధులు గోవు దాని సంతానముయొక్క సుఖ సమృద్ధులతో కలిసియున్నవి. గోరక్ష నాకత్యంత ప్రియము మూర్తిమంతమగు కవిత్వము గోవునకు సంబంధించిన ధర్మము. గోవును రక్షించుట యన ఈశ్వరుని మూక సృష్టినంతటిని రక్షించుట యగును హిందూ ధర్మమునకు అత్యుత్తమ బాహ్యరూప మేది యని నన్నడిగిన గోరక్షయని చెప్పుదును. మనము అనేక సంవత్సరముల నుండి ఈ ధర్మమును మఱచినట్లు నాకు తోచుచున్నది. గోవును రక్షించు హిందువులున్నంత వఱకే హిందూ ధర్మముండును.

హిందూ దేశములో గోవే మనుష్యునకు తోడు; గొప్ప ఆధారము. ఏ గోమాత అందరిని పాలించు చున్నదో యా మాతను రక్షించుటకు, సేవించుటకు కార్య దక్షులైన వారందరు తమ ప్రతిక్షణమును వినియోగించ వలెను. నా దృష్టిలో గోవధ, మనుష్యుని వధ రెండును సమానములె. గోరక్షా ప్రశ్నను అధ్యయనము చేసిన కొలది నాకు దాని మహత్వము తెలియుచున్నది. ప్రతిదినము నీ ప్రశ్న గంభీరమగుచున్నది. దానిలో దేశముయొక్క ఆర్థిక స్థితి దాగియున్నది.

# కాంగ్రెస్–గోరక్ష

౧౯౨౮ వ సంవత్సరములో గోపాష్టమి రోజున ఢిల్లీ దరియాగంజ్ పటౌదీ హౌస్‌లో ప్రసిద్ధ దేశనాయకుడగు లాలా లజపత్‌రాయ్ గారి అధ్యక్షతతో ఒక సభ జరిగినది. హకీమ్ అజ్మల్ ఖాన్ స్వాగతాధ్యక్షులు. గాంధి మహాత్ముడు, పండిత్ మోతీలాల్ నెహ్రూ మరియు ఇతర దేశ నాయకులు ఈ సభలో పాల్గొనిరి. "ఆంగ్లేయ ప్రభుత్వము గోవధను బందుచేయ నంతవరకు దానికి సహకారము చేయరాదు." అను నీ తీర్మానము సర్వ సమ్మతితో తీర్మానింప బడినది. బృందావనములో కూడ గోసమ్మేళనము చేసి కాంగ్రెస్ నాయకులు ఇట్టి తీర్మానమునే చేసిరి. దేశవాసుల భావనను, అవశ్యకతను దృష్టియందుంచు కొని స్వరాజ్య ఘోషణతో పాటు గోవధ నిషేధమునుకూడ చేయవలసి యుండెను పండిత మదనమోహన మాలవ్యగారు కూడ ఇట్లే ఆశించి యుండెను కాని రాజ్యమును నడుపు నాయకులు గోవధ నిషేధ ప్రశ్నను ఉపేక్షించు చున్నారు.

## గోరక్ష–భారత సంవిధానము.

భారతీయ విధానములో నాల్గవ భాగమునందు రాజ్యనీతిని నిర్దేశించు తత్త్వ ధార 48లో పశువుల విషయమున ట్లున్నది "రాజ్యము కృషి, పశుపాలన రెంటిని అధునిక వైజ్ఞానిక పద్ధతులతో సంఘటితము చేయుటకు ప్రయత్నించును. ముఖ్యముగ అవులు, దూడలు మరియు ఇతర పాలనిచ్చు నట్టివియును, బరువులను మోయు నట్టివియును జంతువుల నసలును (జాతి) రక్షించుటకు, సంస్కరించుటకు మరియు వాని వధను నిషేధించుటకు అగ్రసరమగును.

గోవధను నిషేధించుటకు సంవిధానములో ప్రత్యేకముగా నొక ధార లేక పోవచ్చును. కాని ఉపర్యుక్త ౪౮వ ధారలో గోవులను, దూడలను చంపగూడదను విషయము స్పష్టముగా నున్నది. గోవధను అరికట్టుట రాజ్యమునకిష్టముగాని యెడల ఈ ధారలో గోవులను, దూడలను ప్రత్యేకముగా గ్రహించ వ్యర్థమగును, పాలనిచ్చునట్టియు, బరువు మోయునట్టియు పశువుల వధ ఆపుటకు ప్రయత్నించవలెననుటయే చాలును. అందువలన జనులు చేయు ఆందోళనమును, సంవిధాన ధారా విషయములో పార్లమెంటు మెంబర్లు చేయు వ్యాఖ్యానములను ఈ ధారకున్న వాస్తవిక అర్థమును దృష్టిలో నుంచుకొని గోవధను, పశువధను అరికట్టుట ప్రభుత్వమునకు నైతికముగానే కాక వైధానిక కర్తవ్యమై యున్నది.

## భారతము--గోవంశమహత్త్వము

ప్రపంచములోని ఇతర దేశములలో కృషి ఎక్కువగ గుఱ్ఱములతోను, యంత్రములతోను చేయబడును. ఎద్దులనుపయోగించరు. గోవును పాల కొరకు మాంసము కొరకు ఉపయోగింతురు, అందువలన నా దేశములలో గోవంశమున కధిక మహత్వము లేదు. ఇక భారతదేశములో గోవంశము రెండు విధముల ఉపయోగించుచున్నది, గోవు పాలనిచ్చును. ఎద్దులు వ్యవసాయము చేయుటకు పనికి వచ్చును. కొన్ని ప్రాంతములలో ఎనుములు, దున్నలు నాగలి దున్నుట కుపయోగించినను ముఖ్యముగ వ్యవసాయమునకు ఎద్దులె ఆధారములు. ఎద్దులు బండి లాగును నాగలి దున్నును, మోట తోలును వ్యవసాయము ఎద్దులమిదనే ఆధారపడియున్నది నగరములలో బరువులు మోయుటకును, గ్రామములలో కొన్ని యెడల సవారీ చేయుటకును ఎద్దులు ఉపయోగపడుచున్నవి, భూమిని ఫల వంతము చేయుటకు గోమూత్రము పేడ సర్వోత్తమమైన ఎరువు, ప్రసిద్ధ విశేషజ్ఞుల దృష్టిలో రాసాయనిక పద్ధతులతో తయారు చేసిన ఎరువులు

భూమిని ఎక్కువ కాలము సేద్యము చేసిన యెడల కొన్ని సంవత్సరములకు తరువాత భూమిలో ఫలించు శక్తి క్షీణించుననియు యెంచబడు చున్నది. గోవుల మూత్రములలో భూమిని స్థాయిగ సారవంతము చేయుటకు వేరు గుణమున్నదని చెప్పబడుచున్నది; ఈ ఎరువు రైతులకు సులభ సాధ్యముకూడ గోవులు జీవించి యున్నంత వరకు పాలు పెరుగు నిచ్చును, అన్నమును శాకములును కలిగించును, వీని ద్వారా మన జీవనమును పొడగించును, చచ్చిన తరువాత చర్మము తోను ఎముకలతోను మనకెంతగానో ఉపకరించును జీవించుటకు ధాన్యములవ సరములు అవి గోవంశముపై ఆధారపడి యున్నవి మన దేశముతో గోవుల కున్న సంబంధము జీవులకు శరీరముతో నున్నట్లని చెప్పవచ్చును అందువలననే ఒక కవి—

"గాయ్ హైతో హం హై, గాయ్ నహీంతో హం నహీ"
"గాయ్ మర్ తీతో భారత్ కైసే జీవిత్ రహ సక్ తా హై"
"గాయ్ జీవిత్ హైతో భారత్ కైసే మర సక్ తా హై" అనెను

స్వర్గీయ గాంధి మహాత్ముడు చెప్పినది సత్యమే " భారత సుఖ సమృద్ధులు గోవులు. దాని సంతానము సమృద్ధితో చేరియున్నవి, గోరక్షా సమస్య స్వరాజ్య సమస్యకంటె చిన్నది కాదు అనేక విధముల గోరక్షయే గొప్పదియని నేనంగీకరింతును"

రాష్ట్ర ఆదాయము గోవంశమువలన అయిదవ వంతు

మనదేశవాసులు ఆర్థికొన్నతి, శారీరికొన్నతి. రెండును గోవంశము మీదనే యాధారపడి యున్నవి, గోవంశమువలన నన్నిటికంటె నెక్కువగా దేశమున కాదాయము లభించుచున్నది. ప్రభుత్వపు విశేషజ్ఞుల మతము ననుసరించి 1930–33 సం॥లో వ్యవసాయమువలన కలిగిన ఆదాయము ౨౨ అర్బుదములరూపాయలు. అందులో ౧౧ అర్బుదములు ౩౫ కోట్ల రూపాయలు పశువుల ద్వారా లభించినవి వివరణపట్టిక క్రింద జూడుడు.

| | | |
|---|---|---|
| పాలు, [illegible] నెయ్యి, [illegible]ములు | ౩౧౦ | కోట్లు |
| చర్మము ఎముకలు | ౪౧ | ,, |
| వ్యవసాయమునకు పశువుల పరిశ్రమ | ౫౧౪ | ,, |
| గోమయము [illegible]ము | ౨౭౦ | ,, |
| మొత్తము | ౧౧౩౫ | కోట్లు |

ప్రస్తుతము పశువులవలన వచ్చు ఆదాయము సరిగ లెక్కింప బడుట లేదు. కాని ఇప్పుడున్న ధరలకు ౨౦ అర్బుదముల రూపాయలు వచ్చుచుండవచ్చును అనగా రాష్ట్ర ఆదాయమున ప్రతిశతము రూ. ౨౦ చొప్పున ఆదాయము పశుసంతతివలన వచ్చుచున్నదని భావము. వాస్తవమున పశులు మనదేశ ఆర్థిక భవనమునకు పశువులాధార స్తంభములనక తప్పదు.

## గ్రహన వినాశము లెందువలన?

## ఎన్నటి నుండి?

భారత వాసులకు జీవనధనము భారతీయ సంస్కృతితో అవినాభావసంబంధముగల గోవంశమునకు ఈదేశమునందు నాశనము గలుగుట సుటించరాని దుర్ఘటన యనకతప్పదు. గోవంశ నాశనము, గోహత్య మహమ్మదీయుల యుగము నాటినుండి ప్రారంభమైనట్లు పెక్కురు తలంచు చున్నారు కొందఱు మహమ్మదీయ రాజులు రాజ్యము చేయునపుడు బక్రీదు పండుగ సందర్భమున గోహత్యలు జరిగిన విషయము వాస్తవమే. కాని ఆరోజులలో గోమాంస భక్షణము నామమాత్రము గానే యుండేడిది, గోమాంస వ్యాపారము మాత్రము ఆరోజులలో బొత్తిగా లేదు మొదట ముగల్ బాదు షాహబాబర్ తన కొడుకు హుమాయూను పేర వ్రాసిన విల్ నామా పత్రము నందు 'గోబలి మాత్రము చేయకుము అని

వ్రాసియున్నాడు. హుమాయూన్ అక్బరు, జహాంగీరు మొదలగు మహారాజులందఱు నీయాజ్ఞను పాలించినట్లు ప్రస్తుత తక్కు కాలపువారు నంగీకరించుచున్నారు.

## చర్మము కొఱకు గోహత్య

వ్యాపార రూపమున నేడు చూడబడుచున్న ఘోరతర గోహత్య ఆంగ్లేయుల రాజ్యముతో ప్రారంభమయినది. ప్రప్రథమమున ౧౮౫౦ సం॥ లో భారతదేశమునుండి చర్మము ఎగుమతికి ప్రారంభమయినది, ఆ సంవత్సరమునందె బెంగాల్ నుండి ౪౪ లక్షల పశువుల తోళ్లు, అంతటి సంఖ్యలోనే గొఱ్ఱెలయు, మేకలయు, తోళ్లు విదేశములకు ఎగుమతి చేయబడినవి, ఈతోళ్ల వ్యాపారము విదేశములకెగుమతి చేయుటలో నేడు భారతదేశము ఇతరదేశములన్నింటికంటె ముందుగణింపబడుచున్నది. పంజాబు ప్రభుత్వపు చేతిపనులకు సంబంధించిన డిపార్టుమెంటును పరీక్షించిన శ్రీరోషన్‌లాల్ ఆనంద్‌గారి లెక్కల ప్రకారము సరిగ చంపిన ఆవుల తోళ్లేకాక, గర్భిణీఆవులను చంపి వాని పొట్టలోనున్న దూడల తోళ్లు దీసి ఎగుమతి చేయబడుచున్నట్లు తెలియుచున్నది. ఒక్కకోటి కంటె ఎక్కువ పశువులతోళ్లు ప్రతి వర్షము యెగుమతి యగుచున్నట్లు లెక్కలు తెలుపుచున్నవి. నేడుకూడ ఇంతకు తక్కువ యుండునని చెప్పుటకవకాశముండదు. తోళ్లేకాక యెముకలు, కొమ్ములు, గిట్టలు మాంసము, ప్రేవులు, నరములు, రక్తము, క్రొవ్వు మున్నగు పదార్థముల వ్యాపారము కోట్లకొలది విలువలో జరుగుచున్నది. ప్రపంచమున నెక్కడను ఉపయోగి పశువల వధ జరుగుటలేదు. కాని ఈయభాగ్యదేశమునందు మంచి తోలు, మంచి మాంసము కొఱకు పాలిచ్చు ఆవులు చంపబడుచున్నవి. ఆంగ్లేయ ప్రభుత్వము వ్యాపారము నిమిత్తము గోవుల హత్య చేయించుటయే కాక, యడవులలోనుండు గడ్డిని పశువులు తిను

టకు విలు లేకుండ శాసనముల ద్వారా అరికట్టి గడ్డి సమస్య యొకటి యిక్కడ క్రొత్తది కలిగించింది. దేశమునందు మంచి ననలు లేకుండా చేసింది. హిసార్, రోహతక్ జిల్లాలలో సాధారణముగ రోజుకు ౫, ౬ మానికల పాలిచ్చు గోవులెన్నో పూర్వముండెడివి, కొన్ని తావులలో రోజుకు ౨౦ సేర్లు (౧౦ మానికలు) పాలిచ్చు అవులు కూడ లభించు చుండేడివి. కాని నేడు హిసార్ ప్రభుత్వపు ఫారమ్-పశుశాలలో అవలంబింప బడు కృత్రిమ నసల్ సంస్కారము కారణముగా రోజుకు ౪ మానికలు పాలిచ్చు అవులు దొరకుట కూడ కష్టమైనది. ఈవిధంగా అవుల నసల్ చెడ గొట్టుట యేగాక ప్రజలు స్వయముగా సిద్ధము చేసిన మంచివంశపు గోవులను రక్షించుటకును యత్నము జరుగుట లేదు. పశువుల వ్యాపారులు మంచిపాలనిచ్చు గోవులను, కలకత్తా, బొంబయి, మున్నగు నగరములకు కొనిపోయి యిక్కడ వానిని నాశనము చేయుచుండుటకై యెట్టి నిబంధనలను ప్రభుత్వము చేయులేదు.

ఆంగ్లేయులు గోవులకు శత్రువులు కారు, అట్టియెడ ఆంగ్లేయ రాజ్యమున గోవుల హానివినాశములేల జరిగినవి? అను ప్రశ్నము పయించుకొను వారు, ౫ కోట్ల జనసంఖ్య గల మన యింగ్లండు దేశమునందు, గత యిరువదిసంవత్సరములలో పాలపరిమాణము పెంచునిమిత్తము గోవంశమును వృద్ధిచేయుటలో నలువది (౪౦) కోట్ల రూప్యములు వెచ్చించి యున్నారు. నేడు లండనులో రూపాయికి మానెడు (రెండు శేర్లు) పాలు దొరకును. మనదేశమునందు పట్టణములలో రూపాయికి సేరు పాలు మంచివి దొరకుట కష్టము. ఆంగ్లేయరాజ్యము భారతదేశమునకు గలిగించిన హానికి ముఖ్యకారణము రాజనైతికమని చెప్పవలసి వచ్చుచున్నది. మహమ్మదీయ రాజులీదేశమునందే నివసించిరి. అందువలన వారు గోవంశము నశింపజేయ యత్నింపరైరి. వారికి మాంసము పనికిరాదని కాని, వ్యాపారము వారికిష్టము లేనిదని కాని, చెప్పవలను పడదు. ఈవ్యాపారము వారు బహూకాలమునుండి చేయుచునే యున్నారు. నేడు కూడ

వారికి వ్యాపారముతో సంబంధము లేకపోలేదు. హిందువులు కూడ వ్యాపారము చేయ మొదలిడినారు కాని ఆంగ్లేయులు మనదేశమునందు మహమ్మదీయుల వలె నివసించినవారు కారు. వేల మైళ్లదూరములో ఉండి వారు రాజ్యము చేయవలసిన వారైరి. అందుకు వారు రెండు ఉపాయములను ప్రయోగమున నుంపసాగిరి. ప్రథమము ధర్మము పేరట జాతి పేరిట ప్రజలు పరస్పరము తగవు లాడునట్లు చేయుట. రెండవది భారతీయులను శారీరికముగాను, ఆర్థికముగాను, మానసికము గాను, దుర్బలులను జేయుట, విదేశప్రభుత్వమేదైనను తన శాసన విధానమును మిక్కిలి గట్టి చేయదలచు కొనుట సహజము. అందులకై తన వశములోనున్న ప్రజలను దుర్బలుల జేయక తప్పదు.

## గోమాంసము—ఎగుమతి

౧౯౩౦ సం॥ వరకు చర్మము నిమిత్తము ఎక్కుడుగా గోవధ జరుగు చుండెడిది. గ్రామీణరైతు తనపశువును ఎన్నడును కటికవాని కమ్మెడి వాడు కాడు. ఇప్పుడు నిస్సంకోచముగా నమ్మ ప్రారంభించి నాడు నిర్ధనులే కాక ధనవంతులుకూడ గోవును రక్షించుట, పాలించుట మానినారు. ధార్మిక దృష్టితో గోవును గౌరవించు వారియందును గోభక్త భావము గ గోరక్షాభావన మాత్రము మిగిలి యున్నదే కాని కార్యరూపమున గోరక్షజరుగ నందున గోవులున్నతిని బొందవయ్యె. ఇక వైజ్ఞానిక పద్ధతులతో గోవును రక్షించు కార్యమెక్కడ ప్రారంభము కాగలదు? దేశవాసులలో దారిద్ర్యము, వివశత, అలసత, ప్రమత్తత, యెక్కువయ యినందును గోవంశము నశింప నారంభించినది. మంచి ఆబోతులు లేనందున మంచి నసల్ కూడ దేశమున లేకుండ పోయినది. దేశము నందు నీళ్లు లేకుండుట చేతను, అడవులలో పశువులు మేయరాదని నిషేధించుట చేతను, పొగాకు చెరుకు, మున్నగు పైరులు పశువులమేతకు పనికి రానివి యెక్కుడగుట చేతను, వేరుసెనగ పిండి ఆముదపు పిండి,

ఎముకల పొడి, మున్నగు కృత్రిమ యెరువులు పొలమున నుపయోగించుట చేతను గోవంశము, పశువులు నశించిపోక మరియేమగును?

ఈయంత్ర యుగమునందు, యంత్రముల ద్వారా యేర్పడు వస్తువుల ప్రచారమెక్కువ యై. కొలది పశువుల నాశనము పరాకాష్ఠను బొందినదని చెప్పక తప్పదు. గాంధి మహాత్ముడు, పొలము పనికి నుపయోగించు యంత్రములు, రాసాయనిక యెరువులు, వనస్పతి ఘృతము (డాల్డా) పనికిరానివిగా చెప్పియున్నాడు. ఇవి దేశమునకు హానిప్రదములని చెప్పియున్నాడు. కాని, నేడు పాలకు బదులు పాలపొడి, నేతికి బదులు డాల్డా, గోమయము గోమూత్రము వాడుటకు బదులు అమ్మోనియాసు మొదలయిన కృత్రిమయెరువులు ఎద్దులు! ఆలాగు నాగళ్లకు బదులు ట్రాక్టర్లు వాడి పశువుల యుపయోగితను తగ్గించుచుండుట దుఃఖకరము. ఉపయోగము లేని వస్తువు ఎంతకాలము జీవించును? గోవంశమున విరోధులగు నీపదార్థములు ఇట్లే పెంపొందుచున్న కొలది గవులకు దేశమున తావు లేకుండ పోవును, ఆంగ్లేయ ప్రభుత్వము ఇక్కడ ఉన్నకాలములో మిగిలి యున్న గోవంశము, కూడ నికముందు క్రమముగా నశింపక పోదు;

### గోవును పేక్షించిన దేశమునకు హాని.

ప్రభుత్వము ప్రస్తుతమున్న గోవినాశ పద్ధతులను మార్చుకొనని పక్షమునందును, ప్రజలు స్వయముగా గోవులను రక్షింప బూను కొనక పోయినను, దేశము బాగుపడుట దుర్ఘటము. గుడ్డల మిల్లులు దేశమున నెక్కువ యైన కొలది దేశమున దరిద్రులకు పనులు దొరుకక యెందరో విధవా స్త్రీలు, మగ్గపు నేతగాండ్రు దరిద్రులై బాధపడుచున్నట్లు గోవంశ వినాశము వలనను దేశమున ననేక సమస్యలేర్పడగలవు. పాల పొడి, డాల్డా, కృత్రిమ యెరువులు, ట్రాక్టర్లు, ట్రక్కులు దేశమున నెంత యెక్కువగా దిగుమతి యగునో యంత యధిక మాత్రలో గోవంశము

విరుప యోగమగును. పరిణామమున గోవులు కనుమ గా [illegible] [illegible] పాలుగాక తప్పదు. దేశమున నామమాత్రముగా ధార్మిక భావముతో నడుపు గోశాలలలో ఎన్నిగోవులు రక్షింప బడగలవు? ఈ గోశాలలెంత కాలము నడువ గలవు? గోవుల ప్రయోజనము గుర్తించువారు కొనినను గోశాలలెన్నియుండ గలవు? పాలు పడుకు వారు, నేయువారు కసాయిలు కాబట్టి యెట్లో మాష్టి యెత్తుకొనియో, మరియొకరిని చంపియో తమ్ము తాము బ్రతికించుకొన గలరు, కాని పశువుల గతి యేమి? అవి ఎట్లు జీవింపగలవు? వాని నిర్వహణకు సాధన మేమున్నది? కాబట్టి యంత్ర ర్యాక్త వస్తువుల దిగుమతి, గోమాంసాదుల యెగుమతి అరికట్ట [illegible] నచో కొన్ని నాళ్లకు తరువాత భారతీయులు గోవులను చిత్రములోనో, మూర్తుల రూపముననో జూచు పరిస్థితి రాకపోదు, గోవు [illegible] జాలవు, శుద్ధమైన పాలు, పెరుగు, ఘృతము మున్నగు వస్తువుల కథల పుస్తకములందే చూడవలసి వచ్చును

# గోవధ సమర్థకుల నిర్బల యుక్తులు

ఏ దేశంలో గోవులకు ధార్మికమునను, సాంస్కృతికముగాను, మాత్రమే కాక, శారీరిక, మానసిక, ఆర్థిక దృష్టితోకూడ స్థానమొసగి సర్వ పూర్ణ సాధన మొసగ బడినదో, ఏ భారతదేశమున జనులు గోవుల మాతృభావముతో నాదరించిరో, ఎక్కడ గోవధయను శబ్దము నుచ్చరించుట మహాపాతకమని యెంచబడినదో ఆభారతమున నేడు స్వరాజ్యము వచ్చి యారుసంవత్సరములు గడిచిన మీదట కూడ ప్రభుత్వ పక్షము వారు, మరియితరులును గోవధను సమర్థించుట దుఃఖకరము, గోవధ సమర్థకులు చెప్పు ముఖ్య యుక్తులివి:—

౧. గడ్డి, దాన, మున్నగు పోషణ పదార్థములు తిరిగి పోయిన వుడు అనుపయోగి పశువులు బ్రతికి యున్న పక్షమున మంచిపశువులకు

కావలసినంత ఆహారము లభింపజాలదు. అనుపయోగి పశువులు చంపబడిన మంచి పశువులను చక్కగ పోషింప వచ్చును. నసల్ ఉన్నతము కాగలదు. పాలెక్కువ దొరకగలవు.

౨. పనికిరాని పశువులను చంపినందువలన మాంసము తినువారికి తినుపదార్థము లభింపగలదు. ఖాద్యపదార్థములను సంబంధించిన సమస్య యొకింత తేలిక కాగలదు.

౩. త్రోళ్లు, ఎముకలు, మాంసము మున్నగు వాని నెగుమతి చేసి యందు వచ్చు ధనమెక్కువ చెరుసు డాలర్లు లభించును

౪. చంపిన గోమాంసాదులనుండి పెన్సిలిన్ మున్నగు మందులు తయారు చేయబడును.

౫. వ్యర్థముగానున్న పశువులను చంపినందున పెచ్చుపెరిగియున్న పశువుల సంఖ్య తగ్గగలదు.

౬. మహమ్మదీయుల మతమున గోవధచేయుట యావశ్యకము. మనది సెక్యులర్ స్టేటు కాబట్టి శాసనము ద్వారా గోవధ నిషేధింపతగదు.

౭. ప్రాచీన కాలమున ఋషులు, మునులు గోమాంసమును తినుచుండిరి. ధార్మిక కార్యము లొ నుపయోగించు చుండిరి. కాబట్టి గోవధను నిషేధింప వలసిన యవసరమేమి లేదు.

ఆంగ్లేయుల కీదేశము మీద ప్రేమలేదు ఇక్కడి నభ్యత, సంస్కృతి మున్నగు వానితో కూడ వారికెట్టి సంబంధమును లేదు. అందువలన వారు గోవధకై యేమి చేసినను, అదియెల్ల సమర్థించినను ఆశ్చర్య పడ వలసిన పనిలేదు. కాని భారతదేశవాసులలో , జ్ఞానులు, మాన్యులు

ఆదరింపవగిన సంస్థలకు చెందినవారు, గోవధను సమర్థించుచు చెప్పు యుక్తులు ఎంత ప్రబలములో నీక్రింది మాదిరితో మనము బాగుగ గుర్తింప వచ్చును.

# గోవధ సమర్థుల విచిత్ర యుక్తులు

౧౯౩౯ సం॥న దేశోన్నతికి కావలసిన కార్యక్రమము నొకదాని నేర్పరుచు నిమిత్తము కాంగ్రెసు అధ్యక్షుడు ఒక కమిటిని నియమించెను. ఆకమిటికి అధ్యక్షుడు పం. జవాహర్‌లాల్ నెహ్రూ. ఆ ప్లానింగ్ కమిటీ పశు సంపదను బాగుచేయుటకు, దుగ్ధాదుల నుత్పాదన చేయుటకును నొక సబ్ కమిటిని నియమించినది. ఆ కమిటీవారు ౧౯౪౮–౪–౩౧ తేదీన ప్రకటించిన రిపోర్టులో ౧౮ వ పేజీయందు ఇట్లు వ్రాసి యున్నది. "కనీసము నూటికి అరువది పశువులు ముసలివి, పనికిరానివి, రోగ గ్రస్తములును, కాని ధార్మికభావన కారణమువలన ప్రజలలో నెక్కువభాగం దీ యీపశువులను చంపుటకు గాని, వీని మాంసమును భోజనపదార్థముగా నుపయోగించుటకు కాని అంగీకరింపరు. ఈపశువులను పాలించుటకు గాను ప్రతిసంవత్సరము మిక్కిలి ధనము ఖర్చు చేయబడుచున్నది. దీనికంతటికి కారణము ధర్మము. ఈపనికి మాలిన పశువులు తిని వేయుచున్న ఆహారపదార్థములు గడ్డి గాదము వీనిని చంపి మంచిపశువులకు ఉపయోగించినచో తప్పక పాలు, పెరుగు, నెయి మున్నగు పదార్థములలో తప్పక వృద్ధి కాగలదు."

ఈరిపోర్టులోనే ౨౩ వ పేజీ యందిట్లు వ్రాయబడి యున్నది. జనుల భోజన పద్ధతులలోను, ధార్మిక భావనలలోను క్రాంతి గలిగించి పనికి రాని పశువులనన్నిటిని భోజనపదార్థముల క్రింద యుపయోగింప వలయును, లేదా పొరుగు దేశములకు ఈపశువులను భోజనపదార్థములుగా నుపయోగించుటకుగాను ఎగుమతి చేయవలయును. ప్రభుత్వమునకు

సంబంధించిన పశుపిశేషజ్ఞులు, మరి యితర విశేషజ్ఞులు, ప్రసిద్ధి లేఖకులు అందరు నేడు వ్రాయు పుస్తకములలో వ్యర్థము గా ప్రాచీనులు ధార్మిక కార్యములందు గోమాంసము నుపయోగించినట్లు వ్రాయుట యొక యలవాటుగా కనబడుచున్నది. అంతటితో నూరుకొనక, ప్రాచీనులు మాంసము కొఱకే గోవులను పాలించిరనియు వ్రాయుటకు సాహసించుచున్నారు. ఇట్టి పుస్తకాలను, వీనిని వ్రాయులేఖకులను నేడింత గానో ప్రోత్సహించుచున్నారు.

సాధారణ జనులు కానీ, మామూలు సంస్థలు కానీ గోవధను సమర్థించిన పక్షమున దానినుపేక్షింప వచ్చును. కానీ, కాంగ్రేస్ వంటి మహాసంస్థకు సంబంధించిన ఉపసమితి గోవధను కేవలము సమర్థించుటయే కాక, ప్రజల భోజనపద్ధతులను, ధార్మిక భావనలను కూడ మార్చి వారికి గోమాంసము తినిపింప తీర్మానము చేయుటయు, అందులకై యత్నించుటయు చూచి చూచి యెట్లు ఊరక యుండవలయునో బుద్ధిమంతులూహింతురు గాక ఈకమిటీ వారు నిర్దేశించిన సలహాలలో నున్న దోషములను తెలియుపరచి జనులను సన్మార్గము ప్రవేపించుటకు తగిన యత్నము లాచరింపక తప్పదు.

హఠము, క్రోధము మున్నగు గుణములతో ప్రేరితుడై యొకడు ఇతరుల భావనలకు హాని కలిగింపయత్నించునో యట్టి మనుజుడు న్యాయమునకు సత్యమునకు తిలాంజలి యిచ్చినవాడగును. పైన చెప్పిన సబ్ కమిటీ నూటికి అరువది పశువులు పనికిరానివిగా నిశ్చయించి వానిని మాంసము కొరకై వధచేయుట యుచితమని సలహా యిచ్చినది. ఈసలహా నంగీకరించిన పక్షమున నేడు మనదేశమునందున పదునెనుమిది కోట్ల పశువులలోను పది కోట్ల పశువులు చంపబడ వలయును. ఎంతటి ఘోర అనర్థమో యూహింపనగును.

# ప్రభుత్వపు గోరక్షణ వున్నతి కమేటీ

## ఆంధ్రవిశేషజ్ఞుల రిపోర్టు

ఈరిపోర్టుకు సంబధించిన ౧౯వ పేజీలో పనికి రాని పశువుల సంఖ్య ౧౮ లక్షల అని వ్రాయబడినది. తరువాత మరియొక చోట ౧౯౩౫ సం॥ లో పనికిరాని పశువుల సంఖ్య నూటికి ఐదున్నర యని యున్నది. ౧౯౪౫ సం॥ లో నూటికి రెండు ముక్కాలు అని యున్నది. ఆయనుపాతముతో చూచిన నేడు నూటికి పనికి రాని పశువుల సంఖ్య ఒకటియే లేక ఒకటిన్నరయే యుండవచ్చును. ఈ రిపోర్టులో ౧౯వ పేజిలో పనికిరానట్టియు, సంతానమునీయు లేనట్టియు పశువుల సంఖ్య నూటికి పదికాని లేక ౧౧౦ లక్షలుగాని యుండునని వ్రాసియున్నది. వానిలో నేడు వానికి తిండి దొరకనందున కట్టి ఈనలేని స్థితికి వచ్చినపశువులు కూడ కలిసి యున్నవి. కాని వానికి మంచి గడ్డి దాన లభించిన పక్షమున నవి సంతానమునీయు గలిగినవి యగును. మనుష్యులయొక్కయు పశువులయు ఖాద్య పదార్థములను పరీక్షించి సలహానిచ్చుట కేర్పడిన కమిటి తన రిపోర్టులో ౧౯౫౨ సం॥ యాప్రిలుకు సంబంధించిన ౧౯వ పేజీలో పనికిరాని పశువులను చంపవలయునని సలహా ఇచ్చుటయే కాక యివి సమాప్తమయిన తదుపరి మాంసాహారి దేశములవలె మాంసము కొఱకై పశువులను పెంచవలయునని సలహా కూడ ఇచ్చి యున్నది. కాని పనికిరాని పశువుల సంఖ్య నలువది లక్షలని పేర్కొని యున్నది. ఈసంఖ్యలను చూచినపుడు కాంగ్రెస్ చేనేర్పరుపబడిన రాష్ట్రీయ యోజనాసమితి చూపించిన పనికిరాని పశువుల సంఖ్య తక్కిన రెండు కమిటీలు చూపిన సంఖ్యకంటె నెంతోయెక్కువగా కనిపించుచున్నది. ఇంతటి యసత్యమును తెలుపు నీరిపోర్టును సిద్ధముచేయు సంఘములో నిజమెంత యుండునో యూహింపవచ్చును. మరియు నీసంఘము ప్రయత్నించకుండానే తనయిష్టము వచ్చిన సంఖ్యల నక్కడ నమోదు చేసి యుండు

వని చెప్పక తప్పదు.

మునలా్మను రాజ్యము గోవధకు ప్రోత్సాహము నిచ్చియున్నమాట నిజమే కాని, గోమాంసము తినని వానికి గోమాంసమును తినిపించుటకిట యోచన చేసి యుండదయ్యే. కాంగ్రెస్ చేసేర్పడిన కమిటీ లెక్కలు మాత్రము ఈదేశవాసులను గురించి యొకింతయు నాలోచించినట్లు తోచదు. ఈదేశంలో గోమాంసమే కాదు మాంసముపేరు కూడ సెవగించు కొందరు. ఆకలితో చచ్చిపోవనొప్పు కొందరు కొని యెందరో మాంసము తినరొల్లరు. మొదటి ప్రపంచ యుద్ధము నందు (౧౯౧౪–౧౮) హరి యానానుండి యుద్ధక్షేత్రమునకు వెళ్లిన జనం. జాట్ పల్టన్ ఫ్రాంసు మోర్చాబంది చేరినపుడు వారికి మాంసములేని భోజనము దొరకక పాలు నందన వారు ఆకలితో నుండి, శనగలుతిని, యుద్ధముచేసినారే కాని మాంసము తినరొల్లక పోయిరి. ౧౯౪౭లో జరిగిన మ్యూటినీకి కారణమేమి? గోవు కొవ్వుతో చేసిన తూటాలు కొరకవలని వచ్చుటయే కదా?

కాంగ్రెస్ నాయకులలోను కార్యకర్తలలోను, ఎందరో మాంసము నేరు ఉచ్చరింప నిచ్చగింపని వారుకలరు. కాంగ్రెస్ సంస్థస్వయముగా ఇతరుల ధార్మిక భావనకు క్షతిగలిగింప నిచ్చగింపదు. కాంగ్రెస్ పేరుతో నిట్టి రిపోర్టు ఒకటి వ్రాయబడినదని కొందఱికి తెలియకయే యుండ వచ్చును. కాంగ్రెసు పెద్దలు ఈరిపోర్టును గురించి తమ యభిప్రాయ మును స్పష్టపరచుచు జనులకు తెలియునట్లు జేసిన నెంతయు బాగుండును.

## అనుపయోగి పశువులుపయోగి కావచ్చును

పనికిరాని పశువులను వధింప వలసిన యవసరమేమియులేదు వానివలన ఆర్థికముగాను, నైతికముగాను, లాభమేకాని నష్టమొండును

లేదు. ముసలిపశువులు, వికలాంగపశువులు నూటికి ఒకటి చొప్పున ప్రస్తుతపు లెక్కలననుసరించి దేశమునందు రెండు లక్షలున్నవి. అవి సంతానమునకు లేవు. నిజమే. ఇట్లే పనికిరాని పశువుల సంఖ్య ఒక్క కోటి యున్నది. వీని వంశమును సంస్కరింపక పోవుట చేతను, సరియైన ఆహారము లభింపక పోవుటచేతను నిరుపయోగములైనవి. దీనికి కారణము పశువుల దోషము కాదు; ప్రభుత్వము, జనులు వీరి అజాగ్రత్తయే. యత్నించినచో సంతానము కనలేనివి కూడ సంతానమునకు యోగ్యములు కాగలవు. బదరీ (యు. పి.) రాజాసాహెబ్ ఇట్టి ప్రయోగము చేసి సఫలుడై యున్నాడు.

ఆయన బందిలి దొడ్డినుంచి కొనిన పశువులలో పనికిరానివి, సంతానము కనజాలనివియని యెంచబడిన వానిని చక్కగా మేపి, మంచి వృషభోత్తములతో కలిపి, వానిద్వారా మంచిసంతానము (దూడలు) పొందుట చూచి యున్నాము. మధ్య ప్రదేశమున గవాలా పూనీసలుకు సంబంధించిన ఒక గోవు, కేవలము దూడకొరకు పాలించబడునది. చక్కగా మేపి పోషించిన మీదట రోజుకు ఎనిమిది సేర్ల పాలియ ప్రారంభించింది. ఇది సేవాగ్రామమువారి అనుభవము. మంచిగడ్డిపెట్టి, సనలుసు సంస్కరించిన మీదట బంజాలు గోవుకూడ రోజుకు ఆరుసేర్ల పాలు ఇచ్చుట చూడబడినది. ఇట్లే ఇతర పనికిరాని పశువులను గూడ బాగుగ పాలించి పోషించిన మీదట యవియు నిరుపయోగములు కావు.

భారత ప్రభుత్వపు పశురక్షక కమిటీ రిపోర్టు ౧౫౫ వ పేజీలో నిట్లు వ్రాయబడి యున్నది. అనుపయుక్త పశువులను అడవులందుంచి ప్రతి పశువుకు సంవత్సరమునకు రూ. ౫ ల చొప్పున ఖర్చుపెట్టి వానిని పోషింపవచ్చును. వానికి నీడవసతి కలిగించుటకు కొంత అనగా రూ. ౧-౮-౦ లు కేంద్రశాసనముపైద ఖర్చు చేసిన యెడల ఇట్లొక ముసలిపశువును ఐదుసంవత్సరముల రక్షణమున నుంచుటకు పాకలకు, నౌకరులకు

మున్నగు ఖర్చులకు గాను మొత్తము రు. ౫౦ లు మాత్రమగును. అనగా సంవత్సరమునకొక్క పశువునకు రు. ౧౦ లు మాత్రము ఖర్చు అగును. విశేషజ్ఞుల దృష్టిలో పాలియ్యని రోజులలో గోమూత్రమునందును, గోమయమునందును భూమికి బలము కలిగించు శక్తియెక్కువగునని చెప్పబడు చున్నది. ఇదియంగీకరింప కున్నను పంజాబు ప్రభుత్వమునకు సంబంధించిన కృషి, రాసాయనిక డాక్టరు లెండర్ వేసిన లెక్కల ప్రకారము ఒకపశువన్న సంవత్సరమునకు ౪ టన్నుల గోమయము, ౩౪౭ పౌనుల మూత్రము లభించునని తెలియుచున్నది. ఆడాక్టరు వేసిన లెక్కల ననుసరించి యీమల మూత్రములను అమ్మినచో రు. ౩౦ లు రాగలవు, ఇట్లు సంవత్సరమున కొక్క పనికిరాని ఆవువలన రు. ౨౦లు లాభము లభింపగలదు. ఇట్లు పశువుల మలమూత్రములను వైజ్ఞానిక పద్ధతులతో నుపపాదించుటకు తగిన యేర్పాట్లు చేసినచో పనికిరాని ప్రతి పశువునకు రు. ౨౦ ల చొప్పున వచ్చులాభ మెన్నికోట్లగునో ఊహింపవచ్చును.

బిహార్ రాష్ట్ర ప్రభుత్వపు గోశాలసంఘపు కార్యదర్శి శ్రీ ధర్మపాల సింహుడు సిద్ధపరచిన ఒక రిపోర్టు ౧౪ వ పేజీలో నిట్లున్నది. ఒక ఆవు సంవత్సరమునకు ౩౩౪౬ పౌనుల మూత్రము నిచ్చును. దాని నుండి ౩౦ సేర్ల నైట్రోజన్, ౩౨ సేర్ల ఫాస్ఫేట్, ౨౯ సేర్ల పొటాష్, లభించును. వీని మార్కెటు ధర కనీసము రు. ౪౦-లు. బొంబాయిలో ఒక మహాశయుడు ఒక యంత్రము కనిపెట్టి యున్నాడు. ఇరువదియైదు పశువుల మలమూత్రముల వలన కలుగు గ్యాసుతో నాయంత్రసహాయమున లైటు, పంఖా, పిండి విసురు యంత్రము నడుపుట మున్నగా ఉపయోగములు పొందుచున్నాడు. ఇట్లు విశేషజ్ఞులు పరిశ్రమము చేసినచో పనికిరాని పశువులవలన నెంతో ఉపయోగమును పొందవచ్చునని సిద్ధమగుచున్నది. వానిని చంపినందున సంతతిలాభము రాష్ట్రమున కెన్నడు లభింపదు.

ఈపశువులను మేపుటకు కావలసిన గడ్డి యెటనుండి లభ్యమగును ప్రశ్నకు సమాధానము చెప్పవలసి యున్నది.

### అనుత్పాదక పశువులు స్వల్పఖర్చుతోనే పోషింపవచ్చును

మనదేశము ధాన్యము నుత్పన్నము చేయుట కనేక విధములైన యత్నము లాచరించుచున్నది. ఒకపంటకు బదులు రెండుపంటలు పండించుటకును, బంజరు భూములను సాగుచేసి ౪౦ కోట్ల ఎకరాల భూమిని క్రొత్తగా సాగుచేయుటకు యత్నములు జరుగుచున్నవి. ఈవిధాన పండే పంటలకు రెండు రెట్ల గడ్డి కూడ లభించును. కాలువలు త్రవ్వించుటకు చేయు యత్నముల ద్వారా కట్టలమీద క్రొత్తగ నుత్పన్నమగు పచ్చిగడ్డియు చాల దొరుకగలదు. జొన్నలు, సజ్జలు పండించుటకు చేయు ప్రయత్నము వలనను, తెలగ చెక్కలు కేవలము పశువులకే యుపయోగించుట వలనను పశువులకు గావలసిన గడ్డి, మేత, పిండి కొఱకు ఏమియుండజాలదు.

దేశమునందు ౧౦ కోట్ల ఎకరముల భూమి యడవులుగానున్నది. అక్కడ పెరుగు గడ్డిలో చాలభాగము వ్యర్థముగానే పోవుచున్నది. గోరక్షక ఉన్నతి కమిటీ సూచించినట్లు పశువుల నడవులలోనుంచి పాలించుటకు తగిన ఏర్పాటులు చేసిన దేశమునకెంతో లాభము చేకూరగలదు. అనుత్పాదక పశువులు, పనికిరాని పశువుకు ఎంతో ఉపకారకములు కాగలవు. పంచవర్షీయ ప్రణాళికలో గోరక్షక కమిటీ, అనుపయుక్త పశువులను వధచేయించుటకు బదులు, వానిని అడవులలోనుంచి వానిని పోషించి లాభము నంద వలయు నని యు, అనుభవార్థము ౧౫౦ గోసదనముల నేర్పరిచి యందు మూడులక్షల పనికిరాని పశువుల నుంచుటకు లక్ష్యయించినది.



గోవధ జరిగే దేశాలలో రోజుకు ఒక్కొక్క మణుగు పాలు ఇచ్చు గోవులున్నవి, యని కొందరు బాధ్యత గల పెద్దలే చెప్పుదురు. అక్కడనుండు జనులను మనకంటె నెక్కువ పాలు వెన్న దొరుకు ననియు వారందరు ఇంతే కాక అక్కడి పనికి రాని పశువులుండుటచేతనే పాలు వెన్న మనకు లభింపకున్నవి యనియు వారి యభిప్రాయము. వారి యీ యుక్తి సరియైనది కాదు. పాలు వెన్న యెక్కుడుగా లభించుట కా దేశములందు గోవధ జరుగుట కారణము కాదు. వారు గోవంశమును సంస్కరించి, వానికి కావలసిన ఆహార పదార్థముల నెక్కుడుగా నుత్పన్నము చేయుటయే కారణము. అమెరికా మున్నగు దేశములలో పశువుల యున్నతి కొఱకు ప్రతి పశువున రు ౧ బొప్పున ఖర్చు చేయుదురు. మన దేశమునందు ఉపయుక్తములగు పశువులను సంరక్షించుటకు గాని, పశువుల వంశమును సంస్కరించుటకు గానీ యత్నమే లేదు.

ఉపయుక్త పశువుల వధ ఆపుటకు గల శాసనము ఉపేక్ష.

గోవధను సమర్థించె పశు విశేషజ్ఞులు, ప్రభుత్వము, న్యాయముగా పశువుల నసల్ బాగుచేయుటకు చేసిన చెప్పదగిన కార్యమొకటియు లేదు. ప్రజలు తమ ప్రయత్నముల ద్వారా సిద్ధపరచిన మంచి పశువులను రక్షించుటకు గాన్రీ, వాని నభివృద్ధి చేయుటకు గాని ప్రోత్సాహమిచ్చినది కాదు. మంచి పశువుల వంశమును చెడగొట్టుటకు వీలుగా ప్రభుత్వము కన్నులు మూసికొని యుపేక్షించు చున్నదని చెప్పక తప్పదు.

జనులను భ్రమ పెట్టుటకు మాత్రము కొన్ని ప్రాంతములలో నుపయుక్త పశువుల వధ నిషేధింప బడినది. కాని, ఆశాసనమును అమలు పెట్టు వారెవ్వరును లేరు. ఇటువంటి శాసనములవలన పశుధన రక్షణ

యున్నతికి జరుగ నేరదు. బ్రిటిషు ప్రభుత్వము ౧౯౪౪ సం॥ లో అనుప యోగి పశువుల వధ నరికట్టుటకు శాసనమొకటి చేసినది, దాని వలన నొకింతయు లాభము చేకూరలేదు. లాభ దాయక పశువుల వధయే కాక దూడల వధకూడ జరుగ నారంభించినది. అందు వలన మరల ౯. ౯. ౪, ౭ లో నొక విశేష శాసనము చేసి బ్రిటిషు ప్రభుత్వము పశువధను కొత్తగా జరుగ కుండునట్లు చేసినది. ఇంతవరకు గల అనుభవమును బట్టి చూచిన గోవధను సంపూర్ణముగ ఆపనంతవరకు ఉపయోగి పశువులను వధచేయ రాదని చేయు శాసనములన్నియు నిరుపయోగములని తెలియుచున్నది, పశువుల నెపముతో ఎక్కువ ఉపయోగి పశువుల వధయే జరుగు చుండును. అనుపయోగి పశువుల చర్మాదుల వలన వ్యాపారులకు లాభముండదు అందువలన ఉపయోగి పశువులను చంపరాదని శాసనమున్నచోట్ల కూడ ముఖ్యముగా నుపయోగి పశువులనే చంపి వాని తోళ్లు, మాంసము మున్నగు వ్యాపారము ద్వారా ఎక్కువ లాభము నంద జూతురు. పదునాలుగు సంవత్సరములు దాటిన వయస్సు గల పశువుల (ఆవులు ఎద్దులు) మాంసము రుచికరము కాదు. స్వాస్థ్యకరమునుకాదు. అందువలన మాంసము కొరకు చిన్న వయసులో నున్న వాటినే వధ చెదురు.

అనుపయోగి పశువులు మంచివాని యున్నతికి బాధకములు, వాని వలన గడ్డి తరిగిపోవు చున్నదని చెప్పుట అనుభవమునకు సరికాదు. రాజస్థానము, సౌరాష్ట్రము, మధ్యభారతము, పటియాలా యూనియను, మున్నగు భారత సంస్థానములలో గోవధ సంపూర్ణముగ నిషేధింపబడినది. అక్కడ ఏ పశువు కూడ ఆయావు ఎంత నిరుపయోగకరమైనను వధింప ననువదదు. కాని అక్కడ యితర పశువుల యున్నతికి కేవిధమైన యాటంకము కలుగు చున్నట్లు చెప్పు వారు లేరు. అక్కడ యెట్టి సమస్యలు ఉత్పన్నము కావు, కారణమేమి?

# వృద్ధ పశువుల రక్షించుట మనకు నైతిక కర్తవ్యము

గోవధ నిషేధ ప్రశ్న ఆర్థికమే కాక నైతికము కూడ. కుక్కను పెంచు వాడు అది రోగి యో లేక ముసలిది యో యైననాడు దానిని చంపడు. విశ్వాస పాత్రుడైన నౌకరు పనిచేయ లేని వాడైననాడు యజమాని బుద్ధిమంతుడైనచో పెన్షన్ ఇచ్చును, ఆర్థిక దృష్టితో మన మాతాపితలు వృద్ధులైనప్పుడు అనుపయుక్తులు, భారభూతులు నైననాడు వారి భారమును, ఇచ్చతో భరించి సేవ సేయుదుము కాని వారిని చంపి జూడము అట్లే మనకు పాలు, పెరుగు ఘృతము, ఎరువు నిచ్చి యెంతో కాలము మనకు పకరించిన ఆవులను ముసలివై నంత మాత్రమున వానిని చంప నంగీకరించుట కృతఘ్నత కాక ఏమగును ! అనైతికత కాక వేరొండేమగును? కృతఘ్నత మహాపాపము అనైతికత పతనమునకు మూలము. మనసభ్యత కృతజ్ఞతను ప్రధానముగ నేర్పినది. నీతి దానికి మూలము। అందువలననే యనేక విపత్తులను దాటి నేటికి నది జీవించి యున్నది. గాంధి మహాత్ముడు ౯. ౧౦. ౨౧ దేదినవ జీవనములో నిట్లు వ్రాసి యున్నాడు "హిందూ ధర్మము ప్రపంచమునకు ఇచ్చిన బహుమానము గోరక్షణ హిందూ ధర్మము గోవులను రక్షించు హిందువులున్నంత వరకు నుండును"

వాస్తవము విచారించినచో అనుపయోగి పశువులు, అనుత్పాదక పశువులు దేశమునకు బరువు కావు, వానిని చక్కగా పాలింపగలిగినచో దేశమునకెంతో లాభము నీయగలవు. ఆర్థిక దృష్టితోను నైతికముగాను పశువులను వధ చేయకుండ రక్షించుట మన కర్తవ్యము. రాష్ట్రమునకు క్షేమకరమును.

# గోమాంసము స్వాస్థ్యమునకు హానికరము

మనదేశములో పెక్కురు మాంసమును తినరు. మాంసము తిను వారు కూడ కొలది పరిమాణంలో తిందురు. అదియును మేక, గొఱ్ఱె, మాంసము ఆవుల మాంసము, దూడల మాంసము ఆరోగ్యమునకు మంచిది కాదు. ఇక వృద్ధ పశువులు, రోగగ్రస్తములు, వికలాంగులు నగు పశువులు మాంసము రోగ కారక మగుట వలన నది యెవరూ తిన దగదు. గోవధను సమర్థించు వారు కూడ ఉపయోగ పశువులను చంప రాదందురు. ఉపయోగము తప్పి పశువుల మాంసము పనికి రాదు. అట్టి యెడ గోవధ పూర్ణముగ అరికట్టుట యే దేశమునకు శ్రేయస్కర మగును. మనదేశము వేడి దేశము. ఇక్కడ గోమాంసము తిను వారి స్వాస్థ్యము తప్పక చెడును హిందువులచె వ్రాయబడిన వైద్యశాస్త్ర గ్రంథములలోనే కాక యూనాని గ్రంథములలో కూడ ఒక సంవత్సరపు దూడ మాంసము కూడ చాల ఆలస్యముగా అరుగును, రక్తమును చెడ గొట్టును. కఫము పెంచుతుంది. దీనిని తినువారికి కేన్సర్, కుష్టు, దద్దుర్లు మున్నగు వ్యాధులేర్పడును దురద, కీళ్లనొప్పులు వచ్చును స్త్రీలకు అనేక వ్యాధులు కలిగించును. కాంగ్రెస్ సబ్ కమిటీ యే పనికి రాని ఆవుల మాంసము భోజన పదార్థముగా నుపయోగించుటకు సలహ ఇచ్చినదో యామాంసము మిక్కిలి హాని కరమగుట నిస్సంశయము కాబట్టి వీనిని వధింపక వీలయిన చక్కని పద్ధతులతో కాపాడి వాని మల మూత్రములను ఉపయోగించిన దేశసంపత్తి యెంతయు వర్ధిల్ల గలదు.

# తోళ్ల వ్యాపారముకంటె ఎరువు వలన కలుగు లాభమెక్కువ

గత మూడువర్షములలో విదేశములకు సగటున పాలుకు పది

పండ్రెండు కోట్ల విలువగల తోళ్లు ఎగుమతి చేయ బడినవి. కాని పశువుల ద్వారా రెండు వందల కోట్ల రూపాయలు ప్రతి సంవత్సరమాదాయము వచ్చును. గోరక్షణ కమేటి వారి రిపోర్టును బట్టి నూట పండ్రెండు లక్షల అనుపయోగి పశువుల మల మూత్రముల ద్వారా సాలుకు, ఇరువది కోట్ల రూపాయల కంటె నెక్కుడు అదాయము రాగలదని తెలియు చున్నది. చనిపోయిన తరువాత తోళ్ల వలనను, ఎముకల వలనను వచ్చు ఆదాయము వేరు. ఏముకల యెగుమతిని ఆపి వానిని పంట యెరువుల క్రింద ఉపయోగించినచో ధాన్యోత్పత్తి యెక్కువ యగుటయే కాక కృత్రిమ యెరువుల నిమిత్తము విదేశముల కిచ్చు లక్షల కొలది రూపాయలు దేశమునకు మిగులును. అందువలన ధాన్యము దిగుమతి చేయుటకు గాను తోళ్లను డాలర్ల కొరకు విదేశముల కెగుమతి చేయవలసిన సమస్యయే యుత్పన్నము కాదు. మన దేశమీతోళ్లు మున్నగువాని నెదేశములకు పంపుచున్నదో యాదేశములనుండి మనకు విలాస వస్త్రువులెక్కువగా దిగుమతి యగుచున్నవి. దేశహితమును చూతుమేని విదేశములకు తోల్ల నెగుమతి చేయుటకు గాను గోవధ దేశమునందు జరుగ నిచ్చుట యనావశ్యకమే కాదు హానికరమని సిద్ధమగు చున్నది ఉపయోగి పశువుల వధ యైనను పూర్ణముగ మనము ఆపగలిగితిమేని పనికిరాని పశువుల వధ యంతగాజరుగ నేందు. కారణమేమనః—వాని తోల్లు విదేశములలో కొనువారు ఎక్కువగా నుండరు. మంచి పశువుల తోళ్లే వ్యాపారమున కెక్కుడు ఉపయోగకరములు. లాభదాయకము లను అందువలన అనుపయోగియను నెపముతో మంచి పశువే చంపబడుచున్నది,

ప్రభుత్వము పంచవర్ష ప్రణాళికలో గోవధ పూర్తిగ ఆపిన పక్షమున మందులకు కావలసిన గోవుల హృదయపు సారము మున్నగునవి లభింపవు. అందువలన మందులు దొరకవు. కాబట్టి గోవధను ఆప

రాదు అని వ్రాసి యున్నారు. ఈదేశమునందు కోట్ల కొలది ప్రజలు గోమాంసము పేరు వినుటకే యుచ్చరింపరు. వారామాంస సత్తువతో తయ్యారొనరించిన మందులకు మాత్రమేల వాడుదురు! ప్రజలు మందులు లేక చచ్చుట కంగీకరింతురు కాని గోమాంస సారముతో సిద్ధపరచిన మందులను వారు వాడుట కంగీకరింపరు. వారికి తెలియకుండ మందుల నేపముతో నట్టి నింపనీయు కార్యమొనర్చుట ప్రజలు సహింపరు కూడ వారికి తెలిసిన నాడు. మరియు నేడింత విజ్ఞానము వృద్ధి నొంది యుండ మందులకు కొఱత యేమి? ఏమందులు గోవ్యాపారమునుండి యుత్పన్నము చేయబడుచున్నవో అందలి తత్వములను గుర్తించి మరియొక పదార్థము నుండి యట్టి మందులు సిద్ధపరచుట యసంభవము కాదు. యిటువంటి మందులెక్కడను వాడుకలోను లేవు. అందువలన యిది యొక సాకుగ చెప్పి గోవధను దేశమునందు జరుగనిచ్చుట యెంతయు నన్యాయము. గోవధ మానుకొనుటకంటె వానిని జాగ్రత్తగ కాపాడినచో పాడి పంటలు మెండయి జనుల స్వాస్థ్యము కుదుట బడి రోగులే కారు. మందుల యవసరమే యుండదు, రోగములు కలిగించుకొని చికిత్స చేయించుకొనుట కంటె రోగములనుండియే దూరముగ నుండుట బుద్ధి మత్తయగును!

మన దేశమునందు కావలసిన సంఖ్యకు మంచి పశువులు లేవు. భారత ప్రభుత్వముద్వారా ప్రకటింప బడిన "పశు బజారు రిపోర్టు గ్రంథపు" మొదటి పేజిమీద ఇట్లు వ్రాయబడి యున్నది. "ప్రపంచపు దేశములో భారతమువలె యెక్కడను సంఖ్యలో పశువులున్న దేశము కాదు. ఏదేశములలో పశువుల సంఖ్య మిక్కిలిగా నున్నదో యీమహత్తుపూర్వ దేశముల వలె ఎక్కడ మనదేశములో మనుష్య సంఖ్యను బట్టి చూచిన పశువుల సంఖ్య యెక్కువగా లేదు. కొన్నిదేశములలో పశువులు మనుష్యుల సంఖ్యకనుసరించి యీక్రింది విధమున నున్నవి.

# గవర్నమెంటు మాటలు-చేతలు

౧౯౪౭లో ప్రజలు గోవధ సంపూర్ణముగ అరికట్ట వలసినదని యెంతో ఆందోళన చేసిరి. గవర్నమెంటు ఈయాందోళనచే ప్రభావితము కాక పోలేదు. అయినను, ౧౫ ఆగస్టు రోజున భారత స్వాతంత్ర్యముతో పాటు గోవధ నరికట్టినట్లు ఘోషణ మాత్రము చేయలేదు. కాని ౧౯౪౯ నవంబరు ౧౯ న ప్రభుత్వమొక తీర్మానమిట్లు చేసినది. "దేశము నందు విపరీతముగ పెరిగిపోయిన గోవధ వలన పాలు, పెరుగుతో పాటు ఎద్దులు కూడ తక్కువ యైనవి. శాసన సభలు, సమాచార పత్రికలు సార్వజనిక సభలు పశువుల వధను చట్టము ద్వారా అరికట్ట వలయునని యాందోళన చేయుచున్నవి. ఈ ప్రశ్న నైతికముగాను, ధార్మికముగాను చిక్కులతో కూడినది. కాబట్టి భారత ప్రభుత్వము బాగుగ విచారించి, ప్రభుత్వానికి చెందిన విశేషజ్ఞులతో నొక కమిటీ నేర్పరుచుటకు నిశ్చయించుచున్నది" ఈ కమిటీలో ప్రభుత్వానికి సంబంధించిన విశేషజ్ఞులు అయిదుగురు, అనధికార సభ్యులు ఎనిమిది మంది యేర్పరుపబడిరి. ఈ కమిటీ ౭-౨౨-౪౯ న ఈ క్రింది సమ్మతి తెలిపినది. "ఎట్టి పరిస్థితులలోను భారతదేశము నందు గోవధ చేయుట పనికిరాదని యీ కమిటీ కోరుచున్నది. శాసనము ద్వారా గోవధ అరికట్ట వలయును. భారతదేశము సమృద్ధి గోధనము మీదనే యెక్కువ ఆధారపడి యున్నది గోవధ పూర్ణముగ అరికట్టబడిన నాడే దేశ ఆత్మ సంతోషింప గలదు. పశువుల ఉన్నతి కొరకు విశేష ప్రయత్నములు సలిపిన నాడే యీ దేశము సుభిక్షముగా నుండ గలదు.

కమిటి తన యీ నిర్ణయమును కార్యరూపమున బెట్టుటకు సిఫారసు చేసింది. " పదునాలుగు(౧౪) సంవత్సరముల ఆయువునకులోబడిన ఉపయోగ పశువుల వధ వెంటనే ఆపవలయును. లైసెన్సు లేకుండ, అధికార పత్రమును సంపాదింప కుండ యే పశువును చంప

రాదు. శాసన విరుద్ధముగా చేయుపశువుల వధ నరికట్టు అధికారము పోలీసు చేతిలో నుండ వలయును. రెండు సంవత్సరములలో తగినన్ని గోసదనముల నేర్పరచి వికలాంగ పశువుల నన్నిటిని వాని యజమానుల వద్దనుండి చేర్చి పశువధ యన్ని విధముల పూర్ణముగ ఆపవలయును.

## కమెటీ సలహా బుట్ట దాఖలు

ఉపయోగి పశువుల వధ నాపుటకు భారత ప్రభుత్వమంగీకరించినది. ౨౪-౩-౪౯ తేది సమీపమున, భారత ప్రభుత్వము ప్రాంతీయ ప్రభుత్వాలకు ఉపయోగి పశువుల వధను అరికట్ట వలసినదని తెలియ పరచినది. కాని మదరాసు, ఒరిస్సా, ఆసామ్, హైదరాబాద్ మున్నగు కొన్ని రాష్ట్రప్రభుత్వాలు శాసనము కూడ చేయలేదు. బొంబాయిలో శాసనము చేయబడినది కాని దానిని ఆచరణ బెట్టిన వాడు లేడు ౧-౬-౫౦న బంగాల్ ప్రభుత్వ మీశాసనము నాచరణలో బెట్ట నిశ్చయించినది. కాని, ౬-౪-౫౦న దానిని నిలిపి వేసినది. ఇపుడు మరల ఆశాసనము కార్య రూపము నొందబోవు చున్నది. పరిస్థితులను బట్టి చూచినచో దీని వలనను లాభము కలుగ దని తెలియుచున్నది ఉపయోగి పశువులు దక్కునట్లు కనబడదు కమేటి సమ్మతి ప్రకారము ౧౯౫౦ నవంబరు ౫ తేదీవరకు గోవధ పూర్తిగ నాపుదల కావలసి యుండెను, గోసదనములు సిద్ధపరుపబడ వలసి యుండెను, కాని దేశ దౌర్భాగ్యమేయన, అనుపయోగి, అనుత్పాదక పశువులే కాక యెక్కువగా పాలు పిండు పశువులు కూడ చంప బడుచున్నవని వ్రాయవలసి వచ్చినందుకు మిక్కిలి దుఃఖము. ఒక్క కలకత్తాకే, పంజాబు ఉత్తర ప్రదేశము బిహార్ మున్నగు ప్రాంతముల నుండి ౫౦ వేల మేలయిన సవలుకు చెందిన పశువులు ప్రతిసంవత్సరము తే బడుచున్నవి. వీని దూడలు కలకత్తా చేరుటయే తడవుగా కటిక వాని కత్తులకు గురియగును. "పాలి వ్వుట మానగానే పశువులును కటిక దుకాణము చేరును బొంబాయి

ఉపనులన్నియు గోవంశమును పనికి రానిదిగా సిద్ధము చేయుటకు తప్ప మరియెందు కుపయోగించును?

# 'డాల్డా' ప్రచారము చేయువాడు దేశవిరోధి

గాంధి మహాత్ముడు (౫-౭-౪౦) హరిజన పత్రికలలో 'డాల్డా పశువుల ఉన్నతికి హాని కలిగించునది యని వ్రాసి యున్నాడు. వన స్పతి ఘృతము (డాల్డా) ప్రచారము చేయుట దేశమును మోసము చేయుట యని వ్రాయుచు గాంధిగారు, అట్టి వ్యక్తులు దేశవిరోధులు' అని యున్నారు, గోవధ, డాల్డా, వీటిద్వారా జనుల జీవనతంతువు తెగి పోవుచున్నది, అని గాంధి మాలవీయతో చెప్పియున్నారు. ఇట్లే, ఆచార్య వినోభా భాయీ కిశోరీలాల్ మశ్రువాలా, బాజాజీ, కుమారప్పా మొదలగు మహనీయులందరు డాల్డాకు వ్యతిరేకముగా చెప్పి యున్నారు. దేశ మునందలి ౨౫ రాష్ట్రాలలోను పదునెనిమిది రాష్ట్రాలు, అఖిల భారత కాంగ్రెసు, కాంగ్రెసు వర్కింగు కమిటీ, కేంద్ర పార్లమెంటులో మూడింట రెండు వంతుల మంది సభ్యులు, పం ఠాకురుదాస్ భార్గవ ప్రవేశ పెట్టిన డాల్డా నిషేధ బిల్లును సమర్థించి యున్నారు. కాని, యీ డాల్డా వలన హిందూదేశములోని రైతులు నష్టపడక తప్పినది కాదు. ఇవి వాస్తవముగ స్వాస్థ్యము చెడగొట్టునది. దీని వలన అనైతికత కలగలుపు, వ్యాపార మెక్కుడగు చున్నది. ఈ డాల్డా వ్యాపారము వర్ధిల్లుటకు గాను, గాంధిగారి యను యాయులై ప్రజలను మోసగించుటకు గాంధి పేరు నుపయోగించు మహాను భావులు డాల్డా వ్యాపారులకు తోడ్పడు చున్నారు. కొందరు నామధారులయిన విశేషజ్ఞుల సలహాలచే ప్రభావితు లయి దేశమునకు హాని కలిగించు చున్నారు. డాల్డా నిషేధ బిల్లును అసెంబ్లీలో పెట్టి విచారవిని మయమున కైనను యత్నింపలేదు. దేశ ప్రజలలో నెక్కుడుగా నున్న జనుల అభిప్రాయమును, పేరెన్నిక గనిన గాంధి యనుయాయులను, లెక్క చేయక, బిల్లును శాంత పరచుటకుగాను

ఒక కమిటీ నియమింప బడినది. ఈకమిటీలో నెక్కువ మంది డాల్డాను సమర్థించు వారె నియుక్తులై యున్నారు. కాని ఇంతవరకు ఈ కమిటీ కార్యాన్వితము చేయుటకు తగిన సలహా ఒక్కటియు నిచ్చినట్లు లేదు. కాలము నడుపుటకు గాను, ఒకకోటి రూపాయలు వెచ్చించి విదేశీరంగును తెప్పింప వలయునని మాత్రము సలహా చెప్పినది. ౧౬ జులై ౧౯౫౩న డాల్డా నిషేధ బిల్లు మరల చర్చకు వచ్చి యుండగా ఏప్రిల్ ౧౯౫౦ కమిటీ సుఖ్యాంతరమేదో చెప్పి యది చర్చకు రాకుండ చేయ బడినది.

## డాల్డా సమర్థకులు శ్రీ నెహ్రూజీ

ప్రభుత్వము వనస్పతి (డాల్డా) నేయివలన స్వాస్థ్యమునకు హాని కలుగదని విశ్వసిస్తున్నది. అని శ్రీ నెహ్రూగారు (౧౦-౬-౫౨) లోకసభ యందు చెప్పినారు. ప్రపంచమున నూటికి ౭౫ మంది 'డాల్డా' లేక యితర పదార్థములు వాడు చున్నారు. ఈవాక్యములు కూడ ప్రధాన మంత్రి గారివే. నెహ్రూగారి యీవాక్యములు నిరాధారములని చెప్పుచూ స్వర్గీయ శ్రీ కిశోరిలాల్ మశ్రూవాలా ౨౮-౬-౫౨ హరిజన సేవక్‌లో ఇట్లు వ్రాసి యున్నారు. ప్రధాన మంత్రిగారి వైఖరి యీవిషయములో మిక్కిలి ఖేదమును కలిగించు చున్నది. వారిలో హఠమున్నది. హఠమున్నచోట వైజ్ఞానిక దృష్టికోణ మెట్లుండ గలుగును? వారు చెప్పిన జవాబులో సంఖ్యకు అధికారమేమియు లేదు. ప్రపంచమున నూటికి ౭౫ మంది వనస్పతి కాని మార్గరిన్ కాని వాడుదురని చెప్పుటకు వారికి గల ప్రమాణమేమి? ఇది తెలిసికొనుట కష్టము. వారు చెప్పినమాటల కేది యర్థమో యనియే వారి యభిప్రాయ మగునెడల, ఆఫ్రికా, భారతము చీన్, దూరపూర్వ దేశములలోని జనసంఖ్య ప్రపంచ జనసంఖ్యలో సగము కంటె నెక్కుడుగా నున్నది. వారిలో నూటికి ౭౫ మంది సాధారణ జనులు డాల్డా మున్నగు పదార్థములను వాడుచున్నారా।

# ప్రధాన మంత్రిని జనులడుగవలసి యున్నారు

హిందుదేశములో వనస్పతి నెయితిను వారిని ఇతర డాల్డా అడ పదార్థములను తిను వారితో పోల్చుటెట్లు? హిందుదేశములో గుడ్లు మాంసము మున్నగు స్నిగ్ధపదార్థములు తిని డాల్డాలో నున్న కొఱతను పూర్తిచేయులేని వారే, డాల్డా తినవలసిన వారగుచున్నారు, మనము గుర్తించుకొన వలయును. మఱియు భారత ఆర్థిక జీవనము వ్యవసాయము పశువులు వీనిమీద ఆధారపడి యున్నదని గుర్తింప వలయును. ప్రధాన మంత్రిగారు స్వయముగా నీవిషయము నెన్నో మారులు గుర్తుకు తెచ్చు చుందురు. భారతమున జనుల క్రయశక్తి చాల తక్కువ. అట్టిచో ప్రధానమంత్రి గారు డాల్డా వ్యాపారము నెట్లు సమర్థించు చున్నారో, వారికాధారమేమో తెలియదు ఈవ్యాపారము.

ఎద్దులను ప్రియకరము లగునట్లు చేయును, అందువలన వ్యవసాయమునకు సంకటము చేకూరును. గ్రామమున జరుగు పాలు నెయ్యి వ్యాపారమును అప్రత్యక్షముగా నాశమొనర్చును గ్రామములలోని నూనె గానుగల వ్యాపారమును సమూలముగ నాశనము చేయును. మొదలు సంశోధన క్రియామూలమున నూనెలోనున్న లాభకారి తత్వములను నాశమొనర్చును. మరల దాని పోషకత్వములను వృద్ధి చేయుటయే నూనె జను చేసి పిఱియము చేయును. తరువాత వనస్పతిలో నున్న కొఱతను పూర్తి జేయుటకు దానియందు కృత్రిమ మైన 'ఏ' విటమిన్ కలుపను, ఇంకను ఇతర పదార్థములు కలిపి మరింత ప్రియమగునట్లు చేయ యత్నించును.

ఏ జనులలో క్రయశక్తి చాల తక్కువగా నున్నదో వారి క్రయశక్తిని పెంచుట కిదియేనా యుపాయము?



ఈపైవాక్యములన్నియు సుప్రసిద్ధ..... హరిజన ..... ఉద్ధరింప బడినవి. డాల్డా విరోధ పక్షములో నితర విషయములెన్నో వ్రాయబడినవి. విషయాంతరములకు సంబంధించినవి యగునను భయముతో నిటవాని నుద్ధరింపమైతిమి.

ప్రభుత్వ ప్రకటనల ననుసరించి చూచినను డాల్డా నేతి వలన శుద్ధ నేతి వ్యాపారమునకు హానికలుగునని తెలియు చున్నది. గతపది సంవత్సరములలో డాల్డా వ్యాపారము పదిరెట్లు పెరిగినది. శుద్ధ మైన నెయ్యి సగముకంటె నెక్కువుగా తగ్గి పోయినది. భారతదేశ రైతులకు సుమారు రెండు అర్బుదముల రూప్యములు శుద్ధమైన నేతి వ్యాపారము వలన లభించును. వ్యవసాయము కాక రైతునకు నేతి వ్యాపారము వలన కొంత ఆర్థిక సహాయము లభించుటయేకాక ఇంటి యందు త్రాగుటకు వారికి మజ్జిగ దొరుకును. దాని వలన వారి యారోగ్యమున కెంతో లాభము వాటిల్లు చున్నది. దారిద్ర్యము వలన రైతు భారతదేశమునందు, పాలు, నెయ్యి, వెన్న తాను తినడు. అవి యమ్ముకొని మజ్జిగ మాత్రము తానుపయోగించును. ఆమజ్జిగయే వారికి పుష్టికర పదార్థము, దాని బలముతోనే రైతు జేష్ఠ మాసపు ఎండలో వ్యవసాయము చేయ గలుగును. పుష్యమాసపు చలికి తట్టుకో గలుగును. ఆమజ్జిగ కూడ వారికి లభించని పక్షమున వారి స్వాస్థ్యమును కాపాడుటకు మరియొక పదార్థమేమున్నది?

## ఎముకలు తోళ్లు వీని యెగుమతికి ప్రోత్సాహము

ప్రభుత్వము డాల్డా వ్యాపారమునకు ప్రోత్సాహ మియ్యడమే కాక ఎముకలు, తోళ్లు ఎగుమతి చేయుటకును, వెన్న తీసిన పాలపొడి, పాలు, ఇతర దేశముల నుండి మన దేశమునకు దిగుమతి చేయుటకును అవకాశ మిచ్చి యున్నది. కృత్రిమ క్షీరమును కల్పించి నెమ్మదిగా పశు ధనము

చేసినవి కాని మన ప్రభుత్వము వలె ప్రదేశముల నుండి పనికి రాని కృత్రిమ క్షీరములను తెప్పించుటకు యత్నించినవి కావు. నేడు పశ్చిమ దేశములందు పట్టణములలో సేరు ఆరేడు అణాలు ఖరీదయిన గ్రామము లలో మూడు నాలుగణాలకే సేరుపాలు దొరుకు చున్నవి.

## నోటిలో రామనామము చంకలో కత్తి

ప్రభుత్వమూ లోపల పశుధనము నెంతయు యుపేక్షించు చున్నది. కాగితముల మీద రిపోర్టులలోను గోవధ నిషేధము, నసల్ సంస్కరణము, గోసధనములను స్థాపించుట, గోశాలల నభివృద్ధి పరచుట మున్నగు విషయముల చర్చలు మాత్రము వ్రాసియుండుట చూడ నగును. ఒకవైపున భారత విధాన శభ, గోరక్షా ఉన్నతి సమితి సిఫారిశ్ శాక, పంచవర్ష ప్రణాళికలో వికలాంగ పశువులకు గోసదనముల నేర్ప రచి వానిని పోషింప సలహా నిచ్చి గోవధను సంపూర్ణముగ ఆపివేయ ప్రారంభించినట్లు కనిపించును. ఇంకొక వైపు ప్రభుత్వము గత ఇరు వది యైదు సంవత్సరములనుండి డాల్‌డాకు రంగు వేయుటకు ప్రయత్న ము లాచరించు చున్నది. ఇంకొక వైపున రాష్ట్రప్రభుత్వాలు తమ స్వా యత్త అధికారముల నుపయోగించి గోవధను అరికట్టినవి. వెంటనే కేంద్ర ప్రభుత్వమొక యాజ్ఞాపత్రము ద్వారా రాష్ట్రప్రభుత్వాలను అవి చేసిన గోవధ నిరోధక శాసన విషయమును పునరాలోచన చేయవలసిన దని సలహా యిచ్చుచున్నది.

## మహాపురుషులు—గోరక్షాందోళనము

ఈదేశమునందు గోధన హ్రాసవినాశములు జరిగి నప్పుడంతయు దేశవాసులు దాని నిరోధింప యత్నించ యున్నారు. క్రాంతికులు, వా మమార్గులు ప్రాచీన శాస్త్రములకు అనర్థములు కల్పించి, క్రొత్త వాద

ములనందు చొప్పించియు, జిహ్వాచాపల్యమును దూరమొనర్చుటకై యజ్ఞయాగాదుల నెపమున పశువధను ప్రారంభించి విరివిగా చేయసాగిరి. బుద్ధ భగవానుడు దీనిని విరోధించి నిలుపుదల చేయించుట చరిత్ర ప్రసిద్ధ విషయము. ఇరువది నాలుగవ తీర్థంకరుడైన మహావీరస్వామి శిష్యులైన పుణ్యశ్లాఘకులు లక్షలాది గోవులను పాలించి గోధనము నున్నతికి తెచ్చుటకై యత్నించి యుండిరి. క్రమముగా బౌద్ధ ధర్మావలంబులలో వాస్తవిక మైన అహింసా భావము కొఱతవడి మాంసాహారు లయిన కాలమున శ్రీశంకర భగవత్పాదులు తపోజ్ఞాన బలముల ద్వారా బౌద్ధుల యనాచారములను ఖండించి గోధనము రక్షించుట హిందువులకు ధర్మమని నుడివి యుండెను. ఈదేశమునందు గోవధను అరికట్టకున్న శాంతి పూర్వకముగ రాజ్యమొనర్చుట యసంభవమని యెరిగి బాబరు తన కొమారుడైన హుమాయునుకు గోవధ నరికట్ట వలసినదని యాజ్ఞాపించి యుండెను. టిప్పుసుల్తాను అమృత మహల్, అను గోసంతతిని నవాబు ఝజ్జర్ హరియానా అను ప్రసిద్ధ గోసంతతిని రక్షించి దేశమునకు హితవు చేసిరి.

మన దేశమునందు గోవంశము బాగుగ నున్నందు వలననే మహమ్మదీయ శాసనము సమాప్తమయిన రోజులలో నూత నెయ్యి సేరు మూడు నాలుగణాలకు, పాలు సేరు ఒక్క అణాకు దొరుకు చుండెడివి. ఆంగ్లేయుల రాజ్య మిక్కడ ఏర్పడుటకు పూర్వమీదేశమున గోవధ సంపూర్ణముగ నరికట్ట బడియుండెను. ఆంగ్లేయులు గోమాంస భక్షకులు దేశమున వారి శాసనమేర్పడిన తరువాత వారి వ్యాపార మనోవృత్తి కారణమున మరల గోవధ యిక్కడ ప్రారంభమైనది.

ఆంగ్లేయుల శాసన కాలమునందే భారతదేశములో మొదటి సారి గోవధ వ్యాపార దృష్టితో ప్రారంభమయినది. హిందూ హృదయములో వులకు ఇప్పటికిని స్థానము లేక పోలేదు. వీరు పరాధీనత ననుభవించు

మన్నప్పుడు కూడ గోవధకు విరుద్ధముగా సదా సంఘర్షము చేయుచునే యుండిరి. ౧౮౫౭ సం. జరిగిన సిపాయీ మ్యూటినీ జరుగుటకు గల కారణములలో హిందూ సిపాయీలకు గోవు క్రొవ్వుతో చేయబడిన తోటాలను నోటితో కొరక వలసి వచ్చుట కూడ ఒక కారణము.

గురు గోవింద సింహుడు, వీరశివాజీ మున్నగు వీరులు తమ మాన మర్యాదలను కాపాడుకొనుటకు గాను శస్త్రపాణులై ప్రతీకారమునకు పూనుకొనిరి. అంతే కాక, మన సమాజమునకు, మన దేశమునకు మాత్రమే కాక సమస్త విశ్వమునకు రత్నభూతులైన వీరు తమ యాధ్యాత్మిక శక్తి ద్వారా సమాజమునకు బలము కలిగించి గోవులను రక్షించుటకు ప్రేరణచేసి యున్నారు.

కాని ఆంగ్లేయులు కుటిల రాజనీతిజ్ఞులు అందువలన వారు మరియొక విధముగ వర్తించిరి. వారు మన రీతి రివాజులను, శిక్షాదీక్షలను, సంఘమునకు ఆధారము అయిన ఆచారములనే మార్చుటకు యత్నించిరి. అందు వలననే నేడు గోవధను సమర్థించు హిందువులు కూడ ఇక్కడ తేల్పారి.

దేశనాయకు లీవిషయమును గుర్తించిరి. ఆయాసమయములందు ఆందోళనల ద్వారా దేశమునందు గోరక్షణ భావన రేకెత్తింప జేయుచు వచ్చి యున్నారు.

## గోరక్షణ స్వాతంత్ర్యాందోళనకు అంగము

భగవాన్ బాలగంగాధర తిలకు, మహాత్మాగాంధి మున్నగు మహాపురుషులు స్వాతంత్ర్య ఆందోళనతో బాటు గోరక్షణ, గోవధ నిషేధము గోసేవకు, సంబంధించిన ఆందోళనలు చేయుచునే వచ్చిరి.

౧౯౧౭ లో కలకత్తా హైకోర్టు చీఫ్ జస్టిస్ శ్రీ జాన్ ఉడ్రఫ్ యొక్క యధ్యక్షత యందు అఖిల భారతీయ గోసభ యొకటి నిర్మింప బడినది. ౧౯౨౧ లో స్వరాజ్య అందోళనతో బాటు గోరక్షణ అందోళన కూడ జరిగినది. గొప్ప గొప్ప నాయకులు హిందువులు మహమ్మదీయులు ఇరువురును గోవధకు విరుద్ధముగా ప్రచారమొనర్చిరి. ఎన్నియో స్థలములలో గోరాంగుల ప్రేరణ మీద కూడ బకరీద సమయమున మహమ్మదీయులు గోవధ చేయరైరి. ౧౯౨౪—౨౫ లో బెల్గామునందు జరిగిన కాంగ్రెస్ అధివేశముతో బాటు గాంధీగారు గోరక్షా మండల సమావేశము కూడ చేసిరి. ఈ రెండు సమావేశములను గాంధిగారే యధ్యక్షులుగా నుండిరి. అప్పుడే గోరక్షా మండల విధానమును నిర్మించి కార్యము నారంభించి యుండిరి. పండిత మదనమోహన మాలవ్యాగారు అఖిల భారత గోరక్షా ప్రచార కార్యాలయమును స్థాపించిరి. ౧౯౨౮ సం. లో గోవుల దుర్దశను గుర్తించి గాంధిగారు రచనాత్మక కార్యమును జరుపుటకు గాను గోసేవా సంఘమును స్థాపించి దాని బాధ్యత యంతయు తన ప్రియ సహచరుడైన సేఠ్ జమునా లాల్ బజాజ్‌గారి పైనుంచిరి. గోవులకు సంకటములు కలిగినప్పుడెల్ల బొంబాయి జీవదయా మండలి వానిని రక్షించుట కెంతో యత్నించుచుండెను. ఇంకను గోరక్షసంస్థలెన్నో యేర్పడి పని చేయుచున్నవి.

గోరక్షా అందోళన ప్రారంభించినప్పుడు జనులు అన్ని విధముల దానికి తోడ్పడుచు వచ్చిరి. గోరక్షాందోళనను, గోశాలలను నడుపుటకు కోట్లకొలది రూప్యముల నొసంగుటయే కాక, అందోళన కారణముగ నెందరో ఉరికంబముల నెక్కిన వారును గలరు, శారీరకముగాను, ఆర్థికముగాను అనేక కష్టములకు గురియైనవారున్నారు. జనులు తమ యాందోళన ద్వారా లాహూరు, రతౌనా, లో నేర్పడు కసాయి దుకాణముల నాపు చేయగలిగిరి. అనేక సంవత్సరాల వరకు ఎంత ధనము లభించినను తెలియని వ్యక్తికి ఆవుల నమ్మెడి వారు కారు. అమెరికా సిపాయిలు మాంసము కొఱకు అవులను తూచతూచికొనసాగినపుడు జనులా వ్యాపా

తమును విరోధించుటయే గ్రామగ్రామములలో పంచాయతీలు ఏర్పరచి పశువుల నమ్మకుండునట్లు నియమము లేర్పరచిరి గోవధను నిషేధించుటకు, గోవులను రక్షించుటకు జనులలో అనేక పర్యాయములు ఉత్సాహముప్పతిల్లినది. కాని, సరియైన నేతృత్వము లభింపనందున ఫలితము నిలువ బడదయ్యె. గోవులు స్వయముగా మూక పశువులు. వానిని పాలించు రైతులు నిర్ధనులు, వివశులు, అందు వలన వారు మూక జంతువులు కాక మరి యే మగుదురు?

## పశ్చిమసభ్యత యొక్క ప్రచారము
## అకర్మణ్యత దేశమున నెక్కుడైనవి

భగవాన్ శ్రీకృష్ణుడు, దిలీప మహరాజు పూర్వకాలమున స్వయముగ గోసేవచేసి దృష్టాంతముల నెల కొల్పియుండిరి. దుర్భాగ్య వశమున నేడు గోపాలన నికృష్ట కర్మముగ నెంచ బడుచున్నది. రైతులు దారిద్ర్యము వలన గోవులను రక్షింప లేకున్నారు. సంపన్నులు, కుక్కలను గుఱ్ఱములను, మోటరులను సంపాదించి వాని పోషణలో మునిగి తేలుచున్నారు. గోవంశము నాదరించు వారెవరు ప్రభుత్వము గోధనము నుపేక్షించినది. చదువుకొని నాగరికులు గానుండు వారికి గోపాలన అమర్యాదకు కారణము.

వృద్ధావస్థను బొందినవి, అంగములు సరిగా లేనివి, అనుపయుక్తములునగు పశుపక్షుల పోషణకు అశోక చక్రవర్తియే పింజరాపోలులను స్థాపించి యుండెనో వాని నాధారముగా గొని మూడువందల సంవత్సరములకు పూర్వ మీదేశమునశక్తిలేని గోవులను చంపకుండ రక్షించుటకు గోశాల లేర్పరుప బడినవి. నేడు దేశమునందు సుమారు మూడు వేల గోశాల లున్నట్లు చెప్పబడు చున్నది. కాని, పదునైదు వందల

జనుల నాక్రమించు చున్నవి. ఈపరిస్థితి రానున్న గొప్ప సంకటమును సూచింపక పోదు

ఇతర దేశములలో చాలినంత పౌష్టిక పదార్థములు ప్రజలకు లభించు చున్నందున వ్యాధులక్కడ తగ్గుచున్నవి. మన దేశమునందు కూడ ఏబదిసంవత్సరములకు పూర్వం పాలు,నెయ్యి, పుష్కలముగా దొరకు చున్నందున నాడు ఇప్పటి కంటె ఇన్ని రోగములు కానీ, ఇంతటి భయంకర మృత్యుసంఖ్య కాని లేకుండెడిది.

నేడు మన ప్రభుత్వము దుగ్ధము, నెక్కుడు గానుత్పన్నము చేయుటకు బదులు హస్పిటల్సు మందులు నెక్కువ చేయుచున్నది. చర్చిల్ వంటి రాజనీతిజ్ఞుడు కూడ తనదేశములో శిక్షణకంటె దుగ్ధము నెక్కు డుత్పన్నము చేయుట కిచ్చిన శ్రద్ధ తక్కువైనది కాదు. గత మహాయుద్ధ సమయమున అనేక విపత్తుల నెదుర్కొనియు యూరోపా దేశములు తమ దేశపు భావి పౌరులను బలవంతులనుగా నుంచుటకు గాను మూడు సంవత్సరముల వయస్సు వరకు పిల్లలకు రోజుకు కనీసము ఐదు ఛటాకుల పాలు దొరుకునట్లు వ్యవస్థ చేసి యున్నవి.

భారతదేశము నందు బంజరు భూములు రాళ్లు రప్పలతో నిండి నిమ్నోన్నత ప్రదేశములు గలవి. ట్రాక్టర్లతో మొదట సాగుబడి చేయ వచ్చును. కాని యీదేశమున వ్యవసాయమునకు ముఖ్యమైన సాధనములు నాగలి, యెద్దులు అనియే చెప్పవలసి యుండును. అక్కడక్కడ ఇంజెలు, దున్నలు ఈకార్యము నందుపయోగింప బడినను, ముఖ్యముగా ఎద్దులే పనికి వచ్చునవి. ఇప్పుడు మనదేశమున సుమారు ౨౫ కోట్ల ఎకరముల భూమి సాగుచేయ బడుచున్నది. విశేషజ్ఞులు చెప్పు దానిని బట్టి ఇందులకు ఐదుకోట్ల ఎద్దులు కావలసి యుండును. కాని మన దేశమున ఎద్దుల సంఖ్య ౯౮౦ లక్షలు వీనిలో నూటికి పది ఎద్దులు భారము మోయుటకే ఉపయుక్తమగుచున్నవి. ప్రభుత్వము నలువదికోట్ల ఎకరముల

భూమి సాగుచేయుటకు యోచనచేయుచున్నది. అప్పుడు ఎనిమిది కోట్ల ఎద్దులు కావలసి యుండును. అందువలన నిప్పుడున్న యెద్దులు కాక యింకను మూడు కోట్ల యెద్దులు కావలసి యుండును. ఎద్దులొక్కనాడు పుట్టవు. ఇప్పుడున్న ఎద్దులు కూడ వలసినంత బలము కలిగి లేవు. వాని పోషణ సరిగ లేదు. ఎద్దుల సంఖ్య వానిశక్తి పెంపుచేయ నంత వరకు ధాన్యమెక్కువ పండింప నేరము. అవసరమైన ఎద్దులు లేనందు న పంటలలో హానికలుగు చున్నది

విదేశములకు ధాన్యమును ఎగుమతి చేయు భారతదేశము, అన్ని భండారములతో నిండియుండు భారతదేశము, నేడు పరదేశముల నన్నము కుకపెట్టుమని కోరు దుస్థితి యేర్పడినది. ఇప్పటికైనను మించి పోయినది లేదు. ప్రభుత్వము, విశేషజ్ఞులు ఇక్కడి పరిస్థితులను గుర్తించి విదేశ ములకు నకలు చేయుట మాని తగువిధముల యత్నించిన దేశము సుభిక్షము కాగలదు పరదేశములనుండి ట్రాక్టర్లు, దుగ్ధచూర్ణము, కృత్రిమ యెరువులు తెప్పించుట మాని, ఇక్కడి గోధనమును రక్షించి పెంపు చేయుటకు పూనుకొనినచో దేశము బాగుపడుటలో విలంబముండదు

## గోరక్షణకు రాజ మార్గము

ప్రపంచము నందలి యితర దేశములలో చాల కాలము వరకు గోవుప్రయోజనమును గుర్తింపని దేశములెన్నో కలవు. గోవులు అటవిక జంతువులుగా నెంచబడు చుండెడివి. అట్టి దేశములు ఏబది - సంవత్స రములనుండి గోవుల ప్రయోజనము గుర్తించి వాని యున్నతికొఱకు ననేక విధముల యత్నించు చున్నవి. మన పూర్వజుల విషయమున పురాతన కాలమునుండి యెంతో ముందంజ వేసి యితరులకు మార్గదర్శ కులయి యుండిరి. ఇప్పుడును గ్రామములలో గోధనము నున్నతి పరుచు విధానములు తెలిసి కొనుటయే కాక, వానివంశములను సంస్కరించుట

(౪.) గోరక్షణకు సంబంధించిన సాంస్కృతిక, వ్యావహారిక భావన పెంపొందింప వలయును దానితో బాటు ధార్మిక భావనను సదుపయోగము చేయవలయును.

(౫) పశువులకు వచ్చు రోగముల ప్రతిక్రియలు, వానికి కావలసిన రచనాత్మక కార్యములు పెంపు చేయవలయును, చేయించవలయును.

(౬.) దారిద్ర్యము నందలి లోభ బుద్ధితో గోమాంసము, గోవులను, ఎద్దులను, దూడలను, తోళ్లు విదేశముల కెగుమతి వ్యాపారము చేయువారు దేశద్రోహులగుదురు, అట్టివారిని నిరుత్సాహపరచవలయును.

(౭) గోసదనములను, గోశాలలను స్థాపించి యందు వికలాంగ, వృద్ధ పశువులను పాలింప వలయును,

(౮.) గోవధను పెంపు చేయుటకు తోడ్పడు వస్తువులను ఉపయోగింప రాదు.

వస్తువు యొక్క యుపయోగము తగ్గిన కొలది యావస్తువు నశించు ననుట యర్థశాస్త్ర మానిత సిద్ధాంతము. అందువలన గోవంశము వలన నుత్పన్నమగు వస్తువులు పాలు, నెయ్యి మొదలగునవి వాడక, వానికి బదులు కృత్రిమ వస్తువులను వాడుటవలన గోవంశ నాశన మేర్పడుట తప్పనిసరి యగును. అట్టి వస్తువుల వాడుక నేడు క్రమముగా పెరుగుచున్నది. కాగా ఇదియొక భయంకర సంకట సూచన మనిన వలయును. ఏవస్తువులు బ్రతికియున్న గోవు మూల్యము కంటె చంపబడిన గోమూల్యమునకు నెక్కువ చేయునో యట్టి వస్తువుల వ్యాపారము, వ్యవహారమును అరికట్టుటకైన ఉపాయము నాలోచింపక తప్పదు. గోవు కేవలము ఎముకలు, మాంసము తోళ్ల కొఱకే కాక, సరేశ్ మొదలగు వస్తువులు సిద్ధము చేయుటకును చంపబడుచున్నది. మనము నిత్యము వాడుకొను వస్తువులెన్నో యున్నవి. వాని కొఱకు గోవులు చంపబడుచున్నవి. మృదువైన గోచర్మముతో సిద్ధము చేయబడు చెప్పులు, సూటుకేసులు

సంచులు వాడని ధార్మిక మహాను భావులెందరున్నారు? కాఫ్ లెదర అంటె దూడ తోలుతో చేయబడు వస్తువులెన్నో మన వంట యింటకూడ ప్రవేశించు చున్నవి. కాబట్టి గోవధను నిషేధించుటకు జేయు ఆందోళనతో బాటు, ఏవస్తువులు గోవధ కారణమో పరీక్షింపజేసి యావస్తువుల వ్యాపారము, వ్యవహారము రెండును నిలుపుదల చేయుటకు ప్రభుత్వము ప్రజలు ఇరువురును శ్రద్ధ వహింపవలసి యున్నది. ప్రభుత్వము, దాని విశేషజ్ఞులును, అనుపయుక్త గోవులను కూడ వధ చేయరాదని చెప్పి గోవధ పూర్తిగ నిలుపుదల చేయనంతవరకు గోవంశము ఉన్నత మగుటకెట్టి యవకాశమును లేదు. గత ముప్పది సంవత్సరముల నుండి గోవధ జరుగుచునే యున్నది. లక్షలాది గోవులు వధింప బడినవి. అందు వలన పశువుల యున్నతి కాక పోవుట యటుండ దినదినము గోవంశ నాశన మెక్కువ యగు చున్నట్లు ప్రభుత్వపు రిపోర్టులే చెప్పుచున్నవి.

## గడ్డికొఱతను దీర్చుట కుపాయములు

గడ్డి, దానా మున్నగు పశువుల యాహారమున కుపయోగించు వస్తువులు వాని కొఱకే యుపయోగించి యితర కార్యముల కుపయోగింప రాదు. గడ్డితో అట్టలు చేయుట వలనను, వేరుసెనగ పిండి మున్నగు వానిని ఎరువుల కుపయోగించుట వలనను పశువులకు తిను పదార్థములు తగ్గి పోవు చున్నవి.

గడ్డి పెరుగుటకు వీలైనతావులలో గడ్డి పెంచుటకు ప్రోత్సాహము కలిగింప వలయును. బీళ్లను కాపాడవలయును.

గడ్డిని పెంచి, దానిని సురక్షితముగా నుంచుటకు వైజ్ఞానిక పద్ధతుల నవలంభించుట, గడ్డి యెక్కువగా పెరుగు చోట్లు, వాని వివరము రక్షింప వలయును కరువు వచ్చినపుడా ప్రాంతముల నుండి గడ్డి తెప్పించి కరువు ప్రాంతములకు వితరణ చేయుట,

ఏ పైరుల వలన పశుగ్రాసము తక్కువ యగునో యట్టి పైరులను తగ్గింప వలయును.

తుమ్మలు మొదలగు వృక్షములను పెంచి వాని ఆకులు కాయలు పశువుల మేతకు ఉపయోగించుట.

దేశములో ప్రతిసంవత్సరమును లక్షలాది పశువులు వ్యాధులవలన మరణించు చున్నవి, ప్రభుత్వపు పశువైద్యశాలలు చాల తక్కువగా నున్నవి. ఉన్న వైద్యశాలలు కూడ దూరదూరముగ నుండుట వలనను, తగిన మందులులేక పోవుట చేతను నిరుపయోగకరములగు చున్నవి. అందువలన స్థానిక వస్తువులు, సాధనములు, వానిని తెలిసిన రైతుల సంబంధముతో పశువుల యారోగ్యము కాపాడుటకు తగిన విధులు కని పెట్టి ఆచరణలో పెట్టుట యుచితమగును. ప్రతిగ్రామములోను పశు వైద్యులు లభించునట్లు చూడవలయును. వారు సులభ సాధనములతో వైద్యము చేయువారై యుండవలయును. ఆధునిక పశుడాక్టర్ల సహాయము కూడ వారు పొందునట్లు చూడవలయును.

ధార్మిక భావనను సదుపయోగము చేయవలయును. గోపాష్టమి మున్నగు పర్వదినములలో గోవులకు మిఠాయి వంట వస్తువులను తిని పించుట కంటె అవి స్వాభావికముగ తిను పదార్థములను గడ్డి, పొట్టు మున్నగునవి నిలువచేసి వానిని తగిన విధమున నుపయోగించుట శ్రేయ స్కరమగును. గోదానము మంచి కృత్యమే, కాని, గోవులను చక్కగా పాలించు వ్యక్తులకు, సంస్థలకే వానిని దానము చేయవలయును. గోశాల లను గోవుల హితమును దృష్టిలో నుంచుకొని నిర్మింపవలయును కాని ఆ డంబరము కొఱకు, ప్రదర్శనము కొరకు నిర్మింపరాదు. వీలైనంత వరకు గోశాలలందు తప్పక పశువిశేషజ్ఞుల నుంచుట కేర్పాటు చేయవల యును. ఉత్తర ప్రదేశమునందును, బిహారులోను ఇట్టి కార్యకర్తలను

గోశాలలందుంచి యున్నారు. ప్రతి యింటి యందును ఆవును పెంచు నట్లు ప్రచారమొనరింప వలయును. కాని, పశువునుంచుటకు చోటు, దానికి కావలసి గ్రాసము, మున్నగు వసతులన్నియు నున్నపుడె గోవును పోషింప నమకట్ట వలయును. వేడుకకో, ఆవేశముచే ప్రేరితులయి పేరు ప్రతిష్ఠల కొరకో గోవును పెంచ యత్నింప రాదు. అట్లు చేసినందున గోవును కాని, గోరక్షణ చేయువానికి గాని, లాభముండదు.

గోవంశవధను తొలగించుట, గోవంశము నున్నతము చేయుట, నిజమైన గోపూజయగును ధార్మిక భావనతో పనికిరాని పశువులను ఆబోతులుగా విడిచి పెట్టుటవలన గాని, గోవుల ముఖమునకో, తోకకో పసుపు కుంకుమ పెట్టుట కాని నిజమైన పూజకాదు. దుర్బలములగు ఆబోతుల వలన పశువంశమునకు హాని కలుగును. ధర్మము పేరిట అధర్మము జరుగు చున్నది. మన శాస్త్రములందు ఆబోతును వేయుట చాల పుణ్యముగ చెప్పబడినది. వృద్ధులు చనిపోయినపుడు వాని స్మారకముగా వృషోత్సర్గము చేయుటకు విధానములున్నవి. పారస్కర గృహ్యసూత్రము మూడవ, తొమ్మిదవ కండికలలో ఎట్టి యాబోతును వేయవలయును. ఎటువంటి దానిని వేయరాదో వివరముగా చెప్పబడి యున్నది. దానిననుసరించి, బలముగల సుందరము, నున్నతమునకు ఎద్దులను ఆబోతులుగా వదలినందున గోవంశము మంచిది యగుటకు ఎంతో అవకాశమున్నది. అట్టి పుణ్యకార్యము ప్రాచీన కాలమున నిట్లు చేసినందున దేశమునకెంతో లాభము కలిగినది. కాని నేడు దేశమున ధర్మము పేరిట పనికిరాని ఆబోతులను వేసి గోవంశమును చెడగొట్టుట వలన నెంతో హాని కలిగినది. ప్రభుత్వము, ప్రజలు గోవంశ మహత్త్వమును గుర్తించి వానివధను పూర్ణముగ నిలిపి, దానివంశోన్నతికై పాటు పడుట దేశమునకెంతయు శ్రేయస్సు. గోవంశమును సంస్కరించి ఎక్కువ పాలు, మంచి ఎద్దులను ఉత్పన్నము చేయుటకు యత్నింప వలయును. అందువలన దేశము

సులభకమగును. ప్రపంచపు ధర్మములలోనే మతము వారికిని గోవును చంపుట యనివార్యముకాని, అవశ్యము కాని కాదు. గోవు అందరకు పాలనిచ్చును. అందరును ఎద్దుల పరిశ్రమ మూలమున నుత్పన్నము లగు ధాన్యములను తిందురు గోరక్షణ ప్రశ్న శుద్ధ సంస్కృతికము, రాష్ట్రీయమును. భారతదేశోన్నతి, రక్షణ రెండును గోరక్షణ మీద ఆధార పడియున్నవి.

గాంధి మహాత్ముడు (౧-౨-౪౨) గోసేవాసంఘ ప్రథమ సమావేశము నందు ఋషుల యభిప్రాయమును సమర్థించుచు నిట్లు చెప్పి యున్నాడు.

గోరక్షా సమస్య, గోవధను నిషేధించు చట్టము వలన కాక, గోవంశ మును సంస్కరించు రచనాత్మక కార్యము వలన పరిష్కరింప బడగల దని కొందఱు ప్రభుత్వ పక్షపు వ్యక్తులందరు కాని, యీప్రశ్నమును వాస్తవిక దృష్టితో విచారించి నపుడు, చట్టము ద్వారా గోవధను సంపూ ర్ణముగ నిషేధింప నంతవరకు, రంధ్రమున్న పాత్రలో నీటిని నింపయ త్నించి నట్లు గోవంశ సంస్కారాది పరిశ్రమలన్నియు వ్యర్థములేయగు ననుట నిక్కువము. నేడు దేశమునందు అనుపయుక్తములు నిష్ప్ర యోజనకరములునగు పశువు లేక ఎక్కువ పాలనిచ్చు సుందర పశువులు కూడ చంప బడుచున్నవి. ఈ యుపయుక్తములగు పశువులను రక్షించు టకును దేశమునందెల్ల యెడల నుపయోగపడు చట్టమొక్కటియు లేదు, అస్సాము, ఒరిస్సా, బిహారులలో చట్టమే లేదు. బంగాల్, బొంబాయి, హైద్రాబాదు మున్నగు ప్రాంతములలో కొన్ని భాగములందు ఉపయోగి పశువుల వధ నాపుటకు చట్టమున్నది. కాని వానికి సమీప ప్రదేశము లను గొనిపోయి యట పశువులను వధించు చున్నారు. ఉపయోగము గల వయస్సులో నున్న పశువులను వధించి నందు వలన కటికి వా రికి ఎక్కువ లాభము వచ్చును. నిరుపయోగి వృద్ధ, వికలాంగ పశువుల

వధ వలన వారికంత లాభముండదు. అందువలన కటిక వారు మంచి పశువులనే వధించుటకు వ్యాపారము చేయుటకు యత్నించు చున్నారు. ఉపయోగి పశువులను అనుపయుక్త ములని డాక్టరు ద్వారా సమ్మతిని గ్రహించుటకు లంచమును గూడనిచ్చును.

భారత ప్రభుత్వపు కృషిమంత్రి పంజాబ్ రావు దేశముఖ్, ప. ఠాకుర్‌దాస్ భార్గవ (పార్లమెంటు మెంబరు) గారు, ౨౫. ఏప్రిల్ ౧౯౫౩ న కలకత్తా సమీపమున గార్డనరీచ్ కటిక దుకాణమును చూచిరి. పశువుల డాక్టరుమున్నగు నితరప్రభుత్వాధికారులకు కూడ ఈనిరీక్షణ జరుగ గల దని ముందుగానే తెలియును. అయినను అక్కడ వధకుగొని రాబడిన పశువులను చూచి సర్దార్ దాతార్ సింగ్ పశువుల డాక్టర్‌ను ప్రశ్నించిన మీదట, పశుడాక్టరు ఉపయోగి పశువులను కూడ వధించుట కనుమతి నిచ్చుచున్నాడని స్పష్టముగా తెలిసినది.

బర్మా ప్రభుత్వము, నిరుపయోగ పశువుల వధ మాత్రము చేయవచ్చును అను శాసనము నిరర్థక మగుట చూచి విశేష పరిస్థితులలో మెజిస్ట్రేటు అధికారమును పొందినపుడే నిరుపయోగి పశువును కూడ వధింప వచ్చునని మరల శాసనము చేసియున్నది.

మనదేశము నందు కూడ నిట్లే బర్మాదేశము నందు వలె చట్టమేర్పడినచో ఉపయోగి పశువుల వధ కొంతవరకు తగ్గి వచ్చును. లేకున్న మనదేశ వృద్ధ పశువులు, వికలాంగ పశువులు కటిక వాని దృష్టినుండి రక్షింప బడిన పడవచ్చు. కాని మంచి వయస్సులో నున్న పశువులు మాత్రము వధనుండి తప్పింప బడు నవకాశము లేదు. కారణము వాని వలన కటికివాని కెక్కుడు లాభము లభించుటయే. అందువలన గోవధ పూర్ణముగ నిషేధింప బడినంత వరకు, రచనాత్మక కార్యము కాని, గోవంశ సంస్కరణ ప్రయత్నములు కాని ఫలింప నేరవు. మరియు నిప్టి

యత్నముల వలన సిద్ధమగు మంచి పశువులు కూడ వ్యాపారుల ద్వారా ఖలి ప్రదేశములకు గొనిపోబడి యనశ్యము వధింప బడుట నిశ్చితము. వ్యాపారులు ఎక్కువ వెలకు వానిని కొనిపోయి బొంబాయి, కలకత్తా మున్నగు పట్టణములలో పాలిచ్చినంత కాలము పాల వ్యాపారము చేసి, పాలుడగ గానే వానిని కటిక వారి కమ్ముట తక్క వేరొక యుపాయము లేదు. పంజాబు, ఉత్తర ప్రదేశములలో నున్న మంచి వంశపు పశువులిట్లే నాశమైనవి. అందువలన క్రొత్తగా రచనాత్మక కార్యముల వలన నేర్పడు పశువులు కూడ ఈవధకు గురికావనుటకు కారణమూహింప జాలము. ఏగోవు పదిపండ్రెండు దూడలనిచ్చి వంశవృద్ధికి తోడ్పడ గలదో యట్టియావు కూడ ఒకటి రెండు మాట్లు ఈనిన తరువాత కటిక వాని పాలగు చున్నది. ఉపయోగి పశువుల వధను అరికట్టుటకు గాను ప్రభుత్వమునే ౨౪-౩-౧౯౪౯న స్వీకరింపబడిన నీతి నేటివరకు ఆచరణలో పెట్ట బడలేదు. ముందుకూడ ఆచరణకు వచ్చునను ఆశయు లేదు.

వాస్తవమున కేంద్రప్రభుత్వము కాని, ప్రాంతీయ ప్రభుత్వములు కానీ ఉపయోగి పశువుల వధను అపుటకు నిజముగా యత్నింప దలపెట్టవయ్యె.

పం. జవహర్‌లాల్‌గారు రాజ్య ప్రభుత్వము తన యిష్టము వచ్చిన శాసనము లివిషయమున చేయవచ్చును, కాని, కేంద్రప్రభుత్వము చేయజాలదని చెప్పియున్నారు. ఈకథనము రాజనైతిక దృష్టితోను, వైధానిక దృష్టితోను జూచిన కొంచెము బాగుగ నున్నట్లు కనబడవచ్చును కాని వ్యావహారిక దృష్టితో చూచిన సరికాదని తెలియును. భారత ప్రభుత్వపు (౨౦-౧౨-౫౦) పత్రము, రాష్ట్రప్రభుత్వములను గోవధ పూర్తిగ నిలుపుదల చేయకుండ సడ్డగించినది. దానినొక విధముగ ఉపేక్షించినప్పటికని, నేడు పంజాబు, పటియాలా, రాజస్థానము, మున్నగు రాష్ట్రములలో గోవధ పూర్ణముగ నిలుపబడిన ప్రాంతములనుండి అధికార, అనధి

కాత రీతులతో అధిక సంఖ్యలో గోవులు, గోవధ నిలువుదల చేయని ప్రాంతములకు గొనిపో బడుచున్నవి. రాజస్థానము నుండి వేలాది పశువులు దొంగతనముగ పాకిస్తాన్‌కు పోవుచున్నవి. అక్కడ వధ చేయ బడుచున్నవి. కాబట్టి భారతదేశము నందంతట సంపూర్ణముగ గోవధ నిలువ బడని పక్షమున అనుపయోగి పశువుల నెపముతో ఉపయోగి పశువులు ఒక ప్రాంతమునుండి మరియొక ప్రాంతమునకు గొంపోబడి వధ చేయబడుట నిశ్చితము. ఉపయోగి పశువులను వధచేయరాదను చట్టము రాష్ట్రప్రభుత్వములు చేసియు నిష్ప్రయోజనమే, అందువలన గోధనము రక్షింప బడదు, ఇదియంతయు నాటకము. ప్రజలను వంచించుట తప్ప వేరేమియు కాదు.

గోవధ యెట్లు నిలువగలదనునది యొకప్రశ్న. భారత ప్రభుత్వముచే నియుక్తమయిన విశేషజ్ఞుల కమిటీ ౨-౧-౧౯౫౪న రెండు సంవత్సరములలో గోవధ సంపూర్ణముగ నిలుప బడ వలయునని సిఫారశ్ చేసింది. ౨౬-౧౧-౧౯౪౯న తీర్మానింప బడిన భారతీయ విధానములో ౪౮వ ధారలో గోవులు, దూడలు, పెయ్యలు, నాగనినిడ్చు పశువులు, పాలనిచ్చు నితర పశువులు వీని వధ జరుగకుండునట్లు చూచుట రాజ్యనీతి యని నిర్ధారణ చేయబడినది. కాని జనుల ద్వారా దృఢము గాను సంఘీభావము తోను, స్థిరమైన అందోళన జరుప బడ నందున పశువిశేషజ్ఞులు చేసిన సిఫారిశ్, విధాన ధార, రెండును పుటములో బడిపోయినవి. కాగితముల మీద ఉండిపోయినవి.

౫ ఏప్రిల్ ౧౯౫౭వ జరిగిన గోసేవక పరిషత్తులో మాటాడుచు అఖిల భారతీయ కాంగ్రెస్ మహామంత్రి శ్రీ మన్నారాయణ అగ్రవాల్ గారు విధానధార ౪౮ ననుసరించి సంపూర్ణ గోవధ నిషేధమును సమార్థించుచు నిట్లు చెప్పిరి.

" జనులు సంఘీభావముతో అందోళన చేయునంత వరకు విధానము నందు గోవధ నిషేధమునకు తగిన 'ధార' ఉండి నప్పటికిని దేశమునందు గోవధ జరుగుచునే యుండును".

౨౩ డిసెంబరు ౧౯౫౨న పటనా గోసేవా సమ్మేళనమును తెరుచు సమయమున కేంద్రకృషి ఆహారమంత్రి రఫీ అహమద్ కిద్వాయి గారు కూడ జనుల బహుమతమును ఆదరించుచు గోవధను నిలుపుటకు మాట నిచ్చెను.

అందువలన వ్యక్తులు, సంస్థలును, భారతీయ సంస్కృతి, దేశవాసుల శారీరిక, మానసిక, ఆర్థిక యున్నతి నపేక్షించు పక్షమున సంఘీభావము వహించి వైధానిక పద్ధతులతో గోరక్షణ కొఱకు దేశవ్యాపక ప్రజల సమ్మతిని చేకూర్ప వలయును. సమస్త దేశము నందును గోవధ సంపూర్ణముగ చట్టము ద్వారా నిలువుదల చేయు నంతవరకు అందోళన జరుపుచుండవలెను. ప్రజలకు గోవుల వంశము నెట్లు ప్రయోజన రహితముగ వ్యాపారులు చేయుచున్నారో తెలుపవలసి యున్నది ఈయాందోళనము కేవలము గోరక్షణ కొఱకే చేయవలసి యున్నది. జనుల సమ్మతిని సేకరించుటకు స్థాన స్థానములందు సమ్మేళనములు జరుపవలయును గోరక్షణ సంబంధమయిన కరపత్రములు, సాహిత్యము, గ్రామ గ్రామమునందు పంచిపెట్ట వలయును. గోరక్షణ సప్తాహము, గోదివసములు జరిపి గోవులను వ్యాపారులకు, కటిక వాండ్రకు అమ్మకుండునట్లు పశుపాలకులచే ప్రతిజ్ఞలు చేయింప వలయును. కొందఱు గోవధ నిషేధింపబడవలసినదే కాని శాసనము ద్వారా కాదు, అందురు. మద్య నిషేధము కొఱకు, అస్పృశ్యతను బోగొట్టుటకు శాసనములు చేయవచ్చును గోవధను నిలుపుటకు మాత్రము శాసనము చేయరాదు, ఎందువలన ఇది రాష్ట్రీయ అభివృద్ధికి తోడ్పడునది కాబట్టియా?

మధ్యపానము చేయుట నేరమగును కాని గోవధ సేయుట నేరము కాదు వీరు గాంధిమహాత్ముడు కూడ 'గోవధను నిషేధించుటకు శాసనము చేయకూడదు' అనిచెప్పినట్లు చెప్పుచుందురు. గోవధ సేయు వానికి ఇప్పుడు కాదు ప్రాచీన కాలమునుండి దండ విధాన మున్నది. గోవధ సేయు వానిని గుండ్లతో కాల్చి చంపవలయు నని పవిత్ర శాస్త్రములు విధించు చున్నవి. ఈదండ విధానము దార్మిక దృష్టితో కాదు రాష్ట్ర దృష్టితో విధింప బడినది. గోవధ సేయువారి కొఱకు మహమ్మదీయ శాసకులు కూడ దండ విధాన మేర్పరచి యుండిరి. దేశీయ సంస్థానములలో గోహంతకునకు ఖైదు విధింప బడెడిది. నేపాలు సంస్థానమునందు మృత్యుదండన చేయబడి యున్నది. ౧౯౪౪-౪౫లో ఉపయోగి పశువును వధ చేసిన వానికి మూడు సంవత్సరములు ఖైదు విధించు పద్ధతి ఆంగ్లేయు లిక్కడ రాజ్యము చేసినపు డుండెడిది।

ఆచార్య వినోబాజీ, రాష్ట్రపతి డా. రాజేంద్ర ప్రసాద్ జీ, ఇతర సజ్జనుల యుపస్థితిలో ౧౫-౩-౧౯౪౮న గోపురి యందు గాంధిమహాత్ముని సమ్మతితో ఈక్రింది తీర్మానము చేయబడినది.

హిందుస్థాన్ యొక్క రాష్ట్రియ అర్థసాధన దృష్టితో ఆవులు ఎద్దులు దూడలు వీని వధ జరుగుట సర్వదా అనిష్టము. కాబట్టి నేటి విషమ పరిస్థితి యందు, అవివేక పూర్వముగ జరుగు గోవధను దృష్టియందుంచు కొని యీసమ్మేళనము వెంటనే కోడెలు, పెయ్యలు ఉపయోగి పశువులు చంప బడుటకు వీలులేని విధమున శాసనము చేయవలయునని కోరుచున్నది,

గాంధిగారు అనుపయోగి పశువుల వధ శాసనము ద్వారా నిలుపుదల చేయవలయునని సమ్మతి యీయని మాట వాస్తవమే, ౧౬-జూలై-౧౯౫౦ న వెలువడిన నవజీవనము లోని లేఖ చూడుడు.

జనహితమును సంపాదింపుడు. ఒకవేళ రాజ్య మోహము వలన కాని, స్వార్థవశమున కాని, అలసత వలన గాని, ఈ యవసర కర్తవ్యమును లక్ష్యము చేయని పక్షమున మనము మిగలము, మనము సంపాదించిన స్వాతంత్ర్యము మిగలదు. గో. ధ నిలిచి పోయినవాడు జనులలో గోరక్ష భావన జాగ్రత మగును అంతట స్థిరరూపమున రచనాత్మక కార్యము ప్రారంభించును. అందువలన దేశమునకు, గోధనమునకు లాభము చేకూరును. సంస్కృతి ఉద్ధరింప బడును. పాలు నెయ్యి పెంపగును.

## The Constitution an eye opener-

Clause 48 of section 4 of the Indian Constitution runs thus:—

"The state shall endeavour to organise agriculture and animal husbandry on modern and scientific lines and shall, in particular, take steps for preserving and improving the breeds and prohibiting the slaughter, of *cow and calves* and other milch and draught cattle."

### PARLIAMENT OF INDIA

### Questions and answers regarding Cowslaughter'

*FRIDAY, the 15th Dec. 1950.*

Will the Minister of Agriculture be pleased to state :—

(A) Whether it is a fact that some committee had been set up to find out ways and means to ban cow slaughter in our country ?

(b) What were its recommendations ?

(c) What steps have been taken to implement them so for ?

*Answer* :—

*The Honourable Shri K. M. Munshi* :—

(a), (b) & (c).

The Honourable Member's attention is invited to a statement made by my predecessor in office on 24th March, 1949, in the Constituent Assembly. In November, 1947 Government appointed an Expert Committee to consider and recommend a comprehensive plan of action for preserving the cattle wealth of the county and for promoting its development. This committee submitted its report in November 1948. Copies of the report were circulated to the members of the House. The Committeee recommended, inter alia, that the slaughter of Sattle was not desirable in India under any circumstances whatever and that its prohibition

should be enforced by law. In order to achieve this end, the committee suggested that the following recommendations should be given effect to :—

(1) Total prohibition of slaughter of all usefull cattle other than as indicated below:—

(a) Animals over 14 years of age and unfit for work and breeding.

(b) Animals of any age permanently unable to work or breed owing to age, injury or deformity.

(2) Unlicensed and unautherised slaughter of cattle should be prohibited immediately and should be made cognizable offence under law.

(3) *The law for prohibiting slaughter of cattle totally should be enforced as early as possible but in any case within two years of enactment of legislation during which period necessary arrangement should be made for the maintenance care of unserviceable and unproductive animals.*

*Government have decided to accept the first two recommendations of the Committee. The enforcement of the third recommendation is contingent on the establishment of Go-sadans. This matter is being further examined.*

# పరిశిష్టము

*Extract :—*

## SECRET WILL OF BADSHAHA BABAR TO PRINCE HUMAYUN.

'Oh son, the kingdom of India is full of different religion, Praised be the God that He bestowed upon Thee its sovereignity. It is incumbent on Thee to wipe all religious prejudices off the tablet of your heart; administer justice according to the ways of every religion. Avoid especially the sacrifice of the cow *by which thou can not capture the heart of the people of India; and subject of this country may be bound up with royal obligations.*'

(Translation—Original kept in Bhopal State Museum



*Extract from—*

## BHARAT GOVERNMENT'S DIRECTIVE TO THE STATES.

*Dated the 20th December '50*

" ..................In the absence of slaughter, the

best type of hide, which fetches good price in the export markets would no longer be available. A total ban on slaughter is thus detrimental to the export trade and works. In view of what is stated above, the Government of India hope the adverse effects of a total ban on the slaughter of cattle will be realised by the States and in the larger economic and other interests of the country no legal restriction on the slaughter of useless and unproductive cattle will be imposed. States which have already passed legislation totally banning slaughter are accordingly requested to take early steps to reconsider it_ "

[While writing this book, Gandhiji's essays, Shri Satis Chandra Das Gupta's Cow In India, Kalyan's ( Gorakhpur )—special issue on the Cows, and Govt. reports have been consulted. ]



ఆ ర్య స మా జ ము—గో ర క్ష—ఆం దో ళ న ము
( శ్రీ. పం. ధు రేం ద్ర శా స్త్రి - రా జ గు రు వు. )

# సార్వదేశిక ఆర్యప్రతినిధి సభాధ్యక్షులు

సార్వదేశిక ఆర్యప్రతినిధిసభ గోవధను నిషేధింప బూనుకొని, (౨౭-౨-౫౩) అంతరంగ సభలో నందులకు వలయు నాందోళనము జరుప నిర్ణయించినది. స్వతంత్ర భారతమున గోహత్య నిలిచి పోగల దని భావించితిమి. విదేశీయుల పాలన కాలమున గోవధను నిలుపుటకై యనేక పర్యాయములు యత్నించిన దేశనాయకులు, భక్తులును దేశము నకు స్వాతంత్ర్యము లభించి ప్రజా ప్రభుత్వమేర్పడిన తదుపరి కూడ గోవధను నిరాటంకముగ జరుగ నిత్తురని యెన్నడును నెంచి యుండ మైతిమి, శాసనాధికారము స్వాయత్తము కాగానే ప్రథమమున గోవధ దేశమునందు జరుగ కుండ నిట్లు శాసనము చేయగలరని యాసించితిమి. స్వతంత్ర భారతమున గోవధను నిషేధింపుడని ప్రభుత్వాధికారులను గోరుచు నందులకై యాందోళనము జరుప వలసి వచ్చునని స్వప్నము నందును నెన్నడును భావించి యుండమైతిమి. అందువలననే ఆర్య సమాజము భారతమునకు స్వాతంత్ర్యము లభించిన తరువాత కూడ నైదారు సంవత్సరముల దీర్ఘకాలము ప్రతీక్షించినది. కాని, గోవధ నిషేధింప బడుటకు బదులు దేశమునందు పూర్వము కంటె నెక్కుడుగ దినదినము గోవధ జరుగు చున్నది. కటిక దుకాణములు క్రొత్తవి యేర్పడు చున్నవి. గోమాంసము ఎండివిగా పరదేశముల కెగుమతి చేయబడు చున్నది. ఇది యంతయు జూచి సార్వదేశిక ఆర్యప్రతి నిధిసభ తన సామూహిక శక్తిని వినియోగించి గోరక్షణకై యత్నింప నిశ్చయించినది. ఇందులకై రాష్ట్రప్రభుత్వమును గోవధను నిలుపుడని యర్థింప నారంభించినది. భారతమున గోరక్షణ ద్వారా జనులకు

శ్రేయస్సు కలుగ గలదని యెంచి యీకార్యము సందార్యసమాజము తన శక్తిని వినియోగింప నెంచినది. ఈపవిత్ర కార్యమును సమాజము తన కార్య క్రమమున కంగముగా గ్రహించుటలో రాజనైతిక ప్రయోజన మొందును దానికి లేదు. అధికార వాంఛతో నీకార్యమున సమాజ మడుగిడ లేదు. అందువలన సార్వదేశిక ఆర్యప్రతినిధిసభ కధ్యక్షుడనై నేను కేంద్రప్రభుత్వము, రాష్ట్ర ప్రభుత్వములు శాస్త్ర పూర్వకముగ గోవధను నిలుపుదల చేయసంత వరకు సమాజమునకు సంబంధించిన ప్రతివ్యక్తియు గోరక్ష ఆందోళన తన కార్యక్రమమునకు ముఖ్యాంగము నెంచి సర్వవిధముల గోవధ మాపుటకు ప్రయత్నింప కలయునని కోరుచున్నాడ

సమాజ సేవకులారా! మహర్షి దయానందుడు తనజీవిత కాలములో దేశము పరాధీనమై యున్నపుడే భారత మస్తకము నుండి గోవధ యనెడి కలంకమును దూరమొనర్ప యుండుట మీరెఱుగనిది కాదు. మహర్షి శబ్దములను స్మరింపడు.

సర్వశక్తిమంతుడగు పరమేశ్వరుడు సృష్టియందలి మానవాత్మలలో తనదయను, న్యాయమును ప్రకాశింప జేయును గాక! అందువలన నెల్లరు దయగలవారై, న్యాయయుక్తులై సతతము సర్వోపకారకములగు కార్యముల నొనర్తురు గాక! స్వార్థపరులై, పక్షపాతులై కృపా పాత్రములగు గోవుమున్నగు పశువుల వినాశము నొనర్పకుందురుగాక! అందువలన దుగ్ధాది పదార్థములు విరివిగా లభించి, కృషిమొదలగు సత్కర్మలు సిద్ధించి యెల్లరు నానందము ననుభవింతురు గాక!

చివరకు ఆర్యసంస్కృతి యందు, భారతీయ సభ్యతయందును, శ్రద్ధా భక్తులుగల ప్రతి హిందు సంస్థయు పూర్ణముగ నీసత్కార్యమందు సహకరింప గలదని విశ్వసించు చున్నాడ.

ఈ పవిత్ర కార్యమునందు మేము సాఫల్యమునందు వరకు భారత జనసముదాయము మాకన్ని విధముల సహకార మొనర్పగలదనియే నాకు విశ్వాసము.

సార్వదేశికసభ యీయాందోళనమును నడుపుటకై యొక యుపసమితి నేర్పాటు చేసినది. అయ్యది త్వరలో తన కార్యక్రమము నొక దానిని సిద్ధపఱచి ప్రకాశింప నున్నది.

ఈయుపసమితి తన కార్యక్రమమును సిద్ధముచేసి ప్రకటించు లోపలి ఆర్యసమాజికులు గోకరుణా నిధిలో నిర్దేశించిన విధమున గోకృష్యాది రక్షిణీసభను స్థాపించి గోరక్షణ కార్యమును ప్రారంభింప వచ్చును.

# గోరక్షాందోళన సంయోజకుని వక్తవ్యము.

శ్రీ మద్దయానంద మహర్షిచే ప్రారంభింప బడిన గోరక్షాందోళనమును సార్వదేశిక ఆర్యప్రతినిధిసభ మరల ప్రారంభింప నిశ్చయించి నట్లు, సభాధ్యక్షులు మాననీయులు, రాజగురువులునగు శ్రీ పం. ధురేంద్ర శాస్త్రిగారు చేసిన ప్రకటన వలన మీకు తెలిసియే యుండవచ్చును.

నేనీ యాందోళన ఉద్దేశమును స్పష్టపఱచుటకు గాను కొన్ని విషయములను చెప్పుట యుచితమని యెంచుచున్నాను. ఈ యాందోళనము రాజనైతిక పక్షములకు సంబంధము లేకుండ దేశోద్ధారమును దృష్టియందుంచి నడుపబడుచున్నది. జనులు [illegible] తమ కర్తవ్యమును పాలించునట్లు చేయుటకై ప్రేమపూర్వకముగా మీ యాందోళనము ద్వారా ప్రయత్నింతుము. పాలనిచ్చు పశువుల కన్నిటికి సేవ జేయుట మాకర్తవ్యము. కాని గోవుల మహాత్మ్యము మిగిలిన పశువుల కంటె మిన్న. గోవుల మహత్త్వమును గూర్చి తెలిసికొనుటకు శ్రీమద్దయానంద మహర్షిచే రచియింప బడిన గోకరుణానిధిని చదువుదురు గాక, దానిని చదువుటయే తడవుగా గోరక్షాందోళనము యొక్క పవిత్ర భావము దృష్టిగోచరము కాగలదు.

ఆందోళనమునకు సంబంధించిన కొన్ని ప్రాథమిక విషయములు (ఉపసమితిచే దిని. ౨౯-౬-౫౩న సభలో సంగీకరింప బడినవి) నిర్దేశార్థమిట పొందుపరుప బడుచున్నవి. ఈ గొప్ప కార్యమునకు సాధించుటకు సాధనములు కూడ గొప్పవిగా గ్రహించుట అవసరము. అవసరమగు నట్టి సాధనములను చేకూర్చుటకు తగినంత సహాయము చేయుటకు మీరు మీశక్తినంతయు వినియోగింప వలయునని ప్రార్థించుచున్నాను. ముందుగా సభద్వారా ప్రకటింప బడిన గోరక్షకు సంబంధించిన ప్రతి

ఖ్యాపత్రములు ఎక్కువ సంఖ్యలో ప్రకటించి, ఆందోళనకు సహాయము చేకూర్చుటకు గాను. ఇట్లను అమ్మి యెక్కుడు ధనము పోగుచేసి గోరక్షా సమితికి సంబంధించిన నిధికి పంపవలయును.

దీనితోబాటు సామాజికులు కాక పోయినను గోవుల విషయమున శ్రద్ధా భక్తులుగల మహనుభావులు, సంస్థలుకూడ మాయాకార్యమునకు తోడ్పడ వలయునని ప్రార్థించుచున్నాడ. ఆర్యసమాజికులతో ననేక విషయములందు మత భేదమున్నను, సామాజికులు కాని గోరక్షణ కార్యముతో నేకీభవించినవారు అత్యధికసంఖ్యలో నెక్కరునుండిరనియే మావిశ్వాసము. అందుచేతన నెల్లరు నార్యసమాజికుల కీవిషయమునందు పూర్ణసహకార మొసంగి వారు ప్రారంభించిన కార్యమును సఫలమొనర్చి పేరొందరగులు కాగలరని నావిశ్వాసము. ప్రతిజ్ఞా పత్రములు, ధనసహాయార్థము అప్పగించవలసిన నోట్లు సార్వదేశిక ఆర్యప్రతినిధిసభ శ్రద్ధానంద బలిదాన భవన్ ఢిల్లీ, వ్రాసిన లభింప గలవు. తెలుగు ప్రార్థనా పత్రములు ఆర్యప్రతినిధిసభ హైదరాబాద్-ద్వారా తెప్పించుకొన వచ్చును.

## గోరక్షణ ఆందోళనమునకు సంబంధించిన నిర్దేశములు

సార్వదేశిక ఆర్యప్రతినిధిసభకు చెందిన అంతరంగ సమితిచే నియమింపబడిన ఉపసమితి తేది ౨౯-౩-౫౩న సమావేశమై, కార్యము నారంభించుటకుగాను క్రింది కార్యక్రమమును నిశ్చయించినది.

(౧) ప్రతి సమాజము తనస్థానము నందొక 'గోకృష్యాది రక్షిణీ సభ' గోకరుణానిధియందు చెప్పబడిన నియమములతో నిర్మించి ప్రతినిధి సభకు తెలియ పరుప వలెను.

(౨) గోకృష్యాది రక్షిణీసభ ఆయాపేటలలో సహకార సమితులను నిర్మించి స్థానికసంస్థలచే నిర్దేశింప బడిన ప్రదేశములందు గోవులను రక్షింప వలయును.

(౩) ప్రతిజ్ఞా పత్రములను ఎక్కుడు సంఖ్యలో నింపి వానిని సార్వదేశిక ఆర్యప్రతినిధి సభకు పంపవలయును. ఒక్కొక్క సమాజము కనీసము నూరు పత్రములు నింపి పంపుట తప్పని సరిగా నెంచవలెను. (ప్రతిజ్ఞ చేయువాడు ఆర్యసమాజ సదస్యుడే కావలయునను నియమము లేదు.)

(౪) గోరక్షణలో గల విశేషములను బోధించుటకు గాను తమ స్థానములందు సార్వజనిక సభలను జరుప వలయును.

(౫) నగర వాసులలో ప్రతి వ్యక్తికి నొకగోకరుణానిధి పుస్తకమును అందజేయ వలయును.

(౬) విధానసభ (శాసనసభ), లోకసభ (పార్లమెంటు), జిల్లా బోర్డు, మ్యునిసిఫాలిటీ, గ్రామపంచాయితి మొదలగు సంస్థలకు సంబంధించిన సదస్యుల (మెంబర్లు) ద్వారా ఆయాసభలలో గోవధను నిషేధించుటకు వలయు తీర్మానములు చేయించి గోవుల రక్షింప యత్నింప వలయును.

(౭) మ్యునిసిపాలిటీ, గ్రామపంచాయతి, జిల్లాబోర్డు, మున్నగు సంస్థలచే నీక్రింది విషయము అంగీకరింప బడునట్లు యత్నింప వలయును.

(౮) తనహద్దులలో శాసనము ద్వారా గోవధ నిలుపుదల చేయించుట,

(౨) గోవులను రక్షించుటకు తగిన స్థలము నగరములో నొసంగి సహకార సమితులకు వారి కార్యక్రమమున తోడ్పడుట.

(౩) క్రొత్తగా నిర్మించు భవనములలో గోవులనుంచుటకు తగిన స్థానమును వేరుగా నుంచునట్లు జూచుట.

(౪) వికలాంగ పశువులను రక్షించుటకు సహాయమొనర్చుట.

(౫) మాంసము, చర్మమునకు సంబంధించిన వ్యాపారమొనర్చు వారికి గోవుల నమ్మకుండ జూచుట.

(౬) ప్రతిగ్రామము నందును పశువులు మేయుటకు వలయు భూమిని కేటాయించునట్లు జూచుట.

(౭) మంచి నసలుకు సంబంధించిన ఆబోతులను పశువుల పాలకుల కిచ్చుట.

(౮) ప్రతివ్యాపారి, దుకాణదారుడు పశుపాలన నిమిత్తమై ధనము సేకరించుటకు తగిన విధానమొక్కటి యేర్పరచునట్లు జూచుట.

(౯) శుద్ధమైన ఆవుపాలు నెయ్యి దొరుకుటకు వీలయిన కేంద్రముల నేర్పరచుట

(౧౦) పెద్ద పెద్ద యజ్ఞముల నొనరించి, గోచర్మముతో చేయబడిన వస్తువుల నుపయోగింపమని ప్రజలచే ప్రతిజ్ఞలు చేయింప వలయును.

(౧౧) తమతమ నివాస స్థలములలోనున్న యితర మతములకు చెందిన వ్యక్తుల సహకారమును కూడ గోరక్షణ విషయములందు సంపాదింప వలయును.

(౧౨) స్థానిక సమాజమునకు చెందిన ముఖ్యవక్తి, నగరమునగల

ప్రముఖ వ్యక్తితో కలిసి సమితి ప్రాంతమున [illegible] గోరక్షా విషయమున జనులకు ప్రోత్సాహమును కలిగింప వలయును.

(౧౩) గోరక్షణ సంగ్రహించు సజ్జనుల పేర్లను చేర్చి యొక సంఘమును నిర్మింప వలయును.

(౧౪) నిత్య-నైమిత్తిక వ్యవహారములలో నుపయోగింపబడు వస్తువులను పరిశీలించి యట్టివస్తువులలో నేవేని గోవధకు కారణభూతమగునది యున్నచో వానిని ప్రజలుపయోగింపకుండునట్లు వారికి బోధింప వలయును.

(౧౫) పాఠ్యపుస్తకములలో గోవధను గాని, గోమాంసమును గాని ప్రోత్సాహించు భాగములున్న నాభాగములను పుస్తకములనుండి తొలగించుటకై పూర్ణప్రయత్నము చేయవలయును.

ఉపర్యుక్త కార్యక్రమము నాచరణలో పెట్టుటకు ప్రతి వ్యక్తి, సమాజము, ప్రతినిధిసభ, అందరును వెంటనే పూనుకొనవలయును.

## విశేష నివేదనము

(క) ఆర్యసమాజమే కార్యమును జేయుదల పెట్టునో బాగుగ నాలోచించి యారంభించును. అది గాలి మేడలు కట్ట తలపెట్టదు. ఈ యాందోళన నారంభించిన ప్రతి యార్యబంధువుడు నివిషయమును మఱవరాదు' ఆర్యసమాజమున కింతకు పూర్వము లభించిన కీర్తిని కాపాడుటయే కాక దాని నినుమడింప జేయవలయును.

(ఖ) మీసమాజముచేయు ప్రతికార్య వివరణము నియమపూర్వకముగ ప్రాంతీయ సభకు, కేంద్ర సభకు పంపుచుండ వలయును. స్థానిక సమాచార పత్రికలందును ప్రకటించుటకై యత్నింప వలయును.

(గ) సభనుండి యీనిర్దేశము మీసమాజమునకు చేరుటయే తప్పుగా మీసమాజమున కెన్ని ప్రతిజ్ఞా పత్రములు పంపబడినవో సభకు తెలియ పరుతురుగాక.

(చ) సభ, గోరక్ష-ఆందోళన సహాయార్థము ఒక్కొక్క రూపాయి నోట్లు రంగులతో నచ్చువేయించినది. దాని (నమూనా) మాదిరి మీకు పంపబడినది. అవి ఒక్కొక్క రూపాయి రసీదులని భావింపుడు. ధనవంతులయినవారు వానినెక్కుడు సంఖ్యలో తీసుకొనునట్లు ప్రేరేపింప వలయును. ౧౦-౨౫-౫౦-౧౦౦ అంతకంటె నెక్కుడు గాని తీసికొనునట్లు చేయవలయును. కనీస మొక్క నోటైనను ప్రతివ్యక్తి తీసికొన వలయునని నిశ్చయింప బడినది. అంతటి శక్తియు లేనివారు ఇరువురో, నలుగురో కలిసి యొక నోటను తీసి కొనినను తీసి కొన వచ్చు. ఈ నోట్లు మీసమాజమున కెన్ని పంపవలయునో వ్రాయుడు.

(ట) మీకు పంపిన ఈనిర్దేశములను బాగుగ ప్రచారము చేయుడు. ప్రతిజ్ఞా పత్రములు, నోట్లు చేరగానే సప్తాహ సత్సంగము సంగం రాబోవు వారమున సార్వజనిక సభ జరుప బడునని వెల్లడింపుడు. ఆదివారమునాడు సంధ్య అగ్నిహోత్రము, ప్రార్థన, వేదోపదేశము నైన తరువాత ప్రముఖవ్యక్తి ద్వారా పది పదునైదు నిమిషములు గోరక్షణ ఆందోళనను గురించి యుపన్యసింప జేయుడు. ఉపన్యసించు వ్యక్తి సమస్యను గంభీరముగా శ్రోతలకు తెలుప వలయును. కటుభావము అంధోత్సాహము ఆందోళనకు గల మహత్త్వమును చెడగొట్టును. కావున ఉపన్యసించు వక్త సత్యమును చక్కగా నిరూపించుట మిక్కిలి యవసరము. సార్వజనిక సభయందు ధనమును, స్వయంసేవకులను సేకరించుటకు శ్రోతలను ప్రార్థింప వలయును. ఈయాందోళన గంభీరముగా నడుపవలయును. ప్రభుత్వపు ఆజ్ఞలను ఉల్లంఘింప రాదు.

---

(త) ప్రతిజ్ఞాపత్రములను నింపి సభకు పంపునప్పుడొక 'లిస్టు' సభకు పంపి, దాని ప్రతిలిపి యొకటి సమాజమున నుంచుకొనవల యును.

(ప) మీనగరములలో సమాజముకాక యితర సంస్థలేవైన నున్న చో వారికి సభానిర్దేశములందచేసిన పిదప వారు సహకార భావమును చూపించి తోడ్పాటు చేసిన యెడల, ఆసంస్థలయు, వాని యధికారులయు హస్తాక్షరములతో పత్రములను సంపాదింప వలయును. అట్టి పత్రము లను సభకు పంపుచు వాని ప్రతిలిపి యొకటి సమాజమున నుంచు కొన వలయును.

(బ) ధనము కూడినట్లు దానిని సభకు పంపుచుండ వలయును. ప్రోవుచేయబడిన ద్రవ్యములో నాలుగవ వంతు స్థానికకార్య కలాపము లలో ఖర్చు చేయుటకై సమాజము తనదగ్గర పెట్టుకొని మిగిలినది లెక్క లతో బాటు సభకు పంపుచుండ వలయును. ప్రతి వారము గోరక్షణకు సంబంధించిన ఆయవ్యయములు సత్సంగమున వినిపించుటయే కాక స్థానిక పత్రములలో ప్రకటింప జేయుట యుత్తమము. దీని వలన జనులలో విశ్వాసము పెంపు కాగలదు.

(మ) స్వయం సేవకులు ప్రథమమున ధనమును ప్రోగుచేయుచు సభనిర్దేశించినట్లు గోరక్షణకు సంబంధించిన కార్యములను నెరవేర్చు చుండవలయును. ఆర్యసమాజమిందులకై సత్యాగ్రహము చేయవలసిన స్థితి యేర్పడదనియే విశ్వసింప బడుచున్నది. శాంతి మయ సాధనము లన్నిటిని ప్రయోగించి యత్నింప బడును, సత్యాగ్రహము మంతిమ సాధనముగా నెంచి గత్యంతరము లేనినాడే యది గ్రహింప బడును అందులకై సిద్ధముగా నుండవలెను.



కవిరాజు హరినామదాసు
(సహాయమంత్రి) బి. ఎ.

# పశువులలో పాలుపెంచుటకు ఉపాయములు

(౧) పశువులకు నిత్యము పొట్టనిండు నట్లు గడ్డి తినిపింప వలయును.

(౨) పాలు తీయుటకు ముందుగా పచ్చిగడ్డి తినిపింప వలయును. క్రమముగా పరిమాణము పెంపవలయును.

(౩) పాలిచ్చుటకు ప్రారంభించిన మొదటి దినమునుండి యీ క్రింది యుపాయములను చేయు చుండవలయును.

అర్ధసేరు (౪౦ తు.) మినపనూకలు, అర్ధసేరు (౪౦ తు) బియ్యము ఉప్పు ౫ తులములు, పసుపు $2\frac{1}{2}$ తులములు నీళ్లలో కలిపి ఉడక బెట్ట వలయును. అందులో ౨౦ తులములు బెల్లము కలిపి కొంచెము వేడి యుండగానే సాయంకాలమున పశువుచే తినిపింప వలయును.

(౪) చెరకు గడ్డ తునకలు కానీ, కొంచెము రసము తీసిన చెరకు దంటుకాని తినిపింప వలయును.

(౫) పసుపు కానీ, తెలగపిండి కానీ, ఉడక బెట్టిన బటాణీలు కానీ తినిపింప వచ్చును.

(౬) ఉడక బెట్టిన వెదురు ఆకులు $2\frac{1}{2}$ తులములు, కొంచెము పాత బెల్లములో కలిపి ఆవుకు పెట్టినచో పాలు వృద్ధి యగును.

(౭) బెల్లము, కాంజీ, కలిపి తినిపించిన పాలెక్కువ యగును.

(౮) నైట్రేట్ ఆఫ్ పొటాసియము, ౫ తులములు. పటిక ౫ తు. బలపపు మన్ను ౫ తు. జీలకర్ర ౫ తు. తెల్లగడ్డల పొడి ౧౦ తు. సోంఫ్, ౫౦ తు. లవంగములు ౫౫ తు. వీనినన్నిటిని బాగుగ పొడి చేయుంచవలయును. ఉదయము సాయంకాలములందు పశువునకు ౧ తు. తినిపించు నపుడు ఊకపొట్టలోనుంచి గుప్పెడు పొడి ఆగత్తితో కలిపి తినిపించిన తప్పక పశువులు పాలనెక్కువగా నిచ్చును.

(౯) పప్పు కడిగిన నీళ్లలో కొంచెము చింతపండు కలిపి పశువులకు త్రాగించిన పాలు ఎక్కువగా నిచ్చును

(౧౦) అకస్మాత్తుగా పాలింకి పోయినచో పచ్చియాకులు, ఊకను కలిపి నూరి బెల్లము, మైదా పిండితో కలిపి తినిపించినచో పశువులు మరల పాలనీయ దొడగును.

(౧౧) పశువుకు దాని పాలను పిండి త్రాగించినచో పాలు పెంపుగా నిచ్చును.

(౧౨) నేయి, బెల్లము, మైదాపిండి కలిపి తినిపించినచో పాలెక్కువగును.

(౧౩) బెల్లము ౧ 1½ సేరు [౧౨౦ తు.] నూవులు 2½ సేర్లు [౨౦౦ తు.] కలిపి ఈనక పెట్టి పశువునకు తినిపించిన చాల దినములవరకు పాలువృద్ధి నొందును.



# సార్వదేశిక సభాంతర్గత గోరక్షాందోళనకు చెందిన ప్రతిజ్ఞాపత్రము

“ ఓమ్ అగ్నే! వ్రతపతే! వ్రతంచరిష్యామి
తచ్ఛకేయమ్ తన్మేరాధ్యతామ్,
ఇదమహమనృతాత్ సత్యముపైమి.”

కృషి ప్రధానమగు భారతదేశమునకు గోమాత యెంతటి యుపయోగకరమో నేను బాగుగ గుర్తించుచున్నాను రాష్ట్రము నుద్ధరించుటకు ఇక్కడి భూమి, జలము, వాయువు, నదులు నెంత మహత్వము కలిగి యున్నవో గోవులు నట్టి మహత్వమునే కలిగి యున్నవి. తను మతాంతర భేదము చూడకయే యీపశుధనము ఇక్కడి ప్రతి వ్యక్తికి నెంతగానో ఉపకరించుటయే కాక శక్తి నొసంగునది యని నావిశ్వాసము, దీనికి సేవజేయుట దీనిని వృద్ధి పరుచుట, మరియు రక్షించుట నాపరమ కర్తవ్యము, దీనికి విపరీతముగ వర్తించుట దేశద్రోహమని యెంచుచున్నాను. సార్వదేశిక ఆర్యప్రతినిధిసభ సభద్వారా నడుపబడు గోరక్షాందోళనము దేశహితకరమని యెంచుచు సభ యాదేశమును లేక యోచనను కార్యరూపమున పరిణమింప జేయుటకు నెల్లప్పుడు సిద్ధముగా నుండును.

నామము ______________________

తండ్రి—భర్తనామము ______________________

ఆయువు:- ______________________

యోగ్యత ______________________

వృత్తి:- ______________________

చిరునామా-(పూర్తి)

తేది ____________

సంతకము.